ప్రపంచ యుద్ధం వస్తే?

Regd. No. M. 3824

# నవ ☭ శక్తి

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక

సంపాదకుడు : మద్దూరి అన్నపూర్ణయ్య

సంపాదకవర్గం

కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య.

యమ్మల వెంకట రామయ్య. మద్దుకూరి చంద్రశేఖరరావు.

సంపుటం 1 | బుధవారము 27–7–38 బెజవాడ | సంచిక 31

## ప్రపంచ యుద్ధ ఫలితం

★  ★

ప్రపంచ మహా సంగ్రామం జరిగింది. లక్షలు, కోట్లు మరణించారు. ఏదో తాత్కాలిక సంధి ఏర్పడింది. కాని యుద్ధాలకు మూలకారణం నశించనిదే యుద్ధాలు ఆగవు. మరో ప్రపంచ సంగ్రామానికి సన్నాహాలు జరుగుచున్నాయి. విజ్ఞానాన్ని, నాగరికతను, ధ్వంసంచేసే యుద్ధాలకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నారు. ఇలాంటి చిత్రాల ద్వారా ప్రచారం చేయడం అందులో ఒక భాగం.

సం॥ చందా 3–0–0 ⁂ 20

Roja Muthiah Research Library
3rd Cross Road, C P T Campus,
Taramani, Chennai - 600 113, India.

# నవశక్తి

చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధసంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

★ ★ ★

అడ్వర్టైజుమెంటు రేటులు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | |
|---|---|
| కాలంలో 1" మొదలు 20" వరకు ప్రతి అంగుళానికి రూ. | 0—6—0 |
| 20"—100" వరకు ,, | 0—4—0 |
| 100" పైగా ,, | 0—3—0 |
| పాతిక పేజీకి | 3—0—0 |
| సగము పేజీకి | 6—0—0 |
| ఒక పేజీ మొదలు 15 పేజీల వరకు పేజీ ఒకటికి | 10—0—0 |
| 15 పేజీలకు పైగా పేజీ 1కి | 7—8—0 |

ఈ వరకు అంగీకరించిన కంట్రాక్టులకు ఈ రేట్లు వర్తించవు.

ఈ రేట్లలో కన్సెషన్సు, కమిషను ఏమీ ఉండవు.

★ ★ ★

చందాదారులను చేర్పించాలి!

ఆం॥ రాం॥ సో॥ పార్టీ కార్యనిర్వాహక వర్గము, జూలై నెలాఖరులో ఈ చందాదారులను చేర్పించ వలసినదిగా తీర్మానించింది. 3 వారాలలో చేర్పించిన చందాదారుల సంఖ్యనుకూడ క్రిందనిస్తున్నాము. పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజాసామాన్యము, ఈ "కోటాలు" పూర్తి అయ్యేటట్లు పనిచేస్తారని ఆసిస్తున్నాం.

| జిల్లా | జూలైకోటా | మూడు వారాలలో చేర్పించినవి. |
|---|---|---|
| విశాఖపట్టణం | 20 | 2 |
| తూర్పు గోదావరి | 75 | 5 |
| పశ్చిమ గోదావరి | 250 | 5 |
| కృష్ణా | 150 | 9 |
| గుంటూరు | 125 | 4 |
| నెల్లూరు | 50 | 22 |
| చిత్తూరు | 20 | 0 |
| కడప | 5 | 0 |
| కర్నూలు | 20 | 0 |
| అనంతపురం | 5 | 0 |
| బళ్లారి | 5 | 0 |
| ఇతర స్థలాలు | 25 | 0 |
| | 750 | 47 |

★ ★ ★

చందాదారులకు విజ్ఞప్తి.

కొంతమంది తాము మా ఏజెంట్లకు చందాడబ్బు ఇచ్చామనియు, పత్రిక రావడము లేదనియూ జాబులు వ్రాస్తున్నారు. మా ఏజెంట్లు విడిప్రతుల నమ్మడానికే మేము బాధ్యులము. వారికి చందా చెల్లించినవారు వారివద్ద నుండియే పత్రిక తీసికొనవలయును. లేదా ఆఫీసుకు తిన్నగా చందాను మనియార్డరు ద్వారాగాని లేక కాన్వాసింగు ఏజెంట్ల ద్వారాగాని పంపించవలయును. దీనిని అందరు గమనించ ప్రార్థన.

మా కాన్వాసింగు ఏజెంట్లు రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక సభ్యులు, జిల్లా పార్టీల కార్యనిర్వాహక సభ్యులు, పట్టణ, తాలూకా పార్టీల కార్యదర్శులు.

## "జనతా"

హిందీ సోషలిస్టు వార పత్రిక

బీహారు రాష్ట్రంలో స్వామి సహజానందుని నాయకత్వం క్రింద జరిగే రైతు ఉద్యమాన్ని గూర్చి తెలుసుకోవాలంటే దీనిని చదువాలి.

సం॥ చందా రు 3-0-0.

మేనేజరు,
జనతా.
బంకిపూరు, పాట్నా.

## విశ్వసాహిత్యమాల

తెలుగులో సోషలిస్టు గ్రంథాల్ని ప్రకటించే గ్రంథమాల.

ఇప్పుడే వెలువడ్డాయి.

లెనిన్ ఉపదేశాలు. వెల 6 అణాలు
(పామీదత్తు రచన కనువాదం.)

పారిస్ కమ్యూన్. వెల 6 అణాలు
(లెనిన్ రచన కనువాదము)

ముచ్చటైన బైండుతో, ఫొటోలతో, చక్కని భాషలో, నూరుపుటలకు పైబడిన గ్రంథాలే యివి రెండూకూడా. వెంటనే వ్రాయండి. ఆలసిస్తే ఏమో?....

త్వరలో వెలువడుతూన్న గ్రంథాలు.

'నాడు-నేడు' అడయంకో.
'బీళ్ళుదున్నేరు.' షోలోకోవ్.
'ఇండియన్ మ్యూటినీ 1857'
'అక్టోబరు విప్లవం' లెనిన్.

మీకేమైనా రాజకీయ గ్రంథాలు కావాలా? అయితే,

వెంటనే మాకు వ్రాయండి.

మహీధర కృష్ణమోహన్
విశ్వసాహిత్యమాల,
ముంగండ,
(via.) అంబాజీపేట, తూ. గోదావరి.

## వేంకట్రామా అండు కో

మావద్ద సమస్త సంస్కృత, ఆంగ్ల, ఆంధ్రహిందీగ్రంథములు, స్కూలు పుస్తకములు, నాటకములు, వైద్యగ్రంథములు వగైరా సరసమైన ధరలకు దొరకును. కేటలాగు ఉచితముగ బంపెదము.

భగవద్గీత :— శ్రీ శంకర భాష్యము శ్రీ కళ్యానంద భారతిగారి విపుల ఆంధ్ర టీకాతాత్పర్యములతో— 3—0—0.

హెడ్డాఫీసు:—ఏలూరు. బ్రాంచీలు : మద్రాసు, తెనాలి, బెజవాడ, పాలకొల్లు, సికిందరాబాదు. (నైజాము.)

వేంకట్రామ అండు కో,
బ్రాంచి : రాజమంద్రి.

## వచ్చే సంచిక నుండి—

నవశక్తి నూతన ఆకర్షణలతో, ప్రత్యేక చిత్రాలతో, **24** పేజీలతో వస్తుంది. పార్టీ సభ్యులూ, పాఠక మిత్రులూ మా యీ కృషికి సహాయము గావించ ప్రార్థన.

★

తంతివార్తల పంపేవారు "ఎడిటర్ నవశక్తి" అని తంతి నీయవలెను. లేనిచో ఆలస్యము - ఇబ్బందీ అవుతుంది గాన గమనించ ప్రార్థన.

మేనేజర్,
నవశక్తి.
గవర్నరుపేట, బెజవాడ.

## లక్ష్మి ప్రావిడెంటు ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్ మచిలీపట్టణము.

మా పట్టాదారులకు, ఏజంట్లకు ఆకర్షణీయమగు

కొన్ని ప్రత్యేక సదుపాయములు.

1. రు 50 లు మొదలు, రు 500 లు, వరకు భీమాచేయుటకు వీలగునట్లు. ప్రావిడెంటు ఇన్సూరెన్సు ప్రణాళికలు గలవు.

2. వైద్య పరీక్షతోను, లేకుండగను, భీమాచేయుట కవకాశము ఏర్పరుప బడినవి.

3. కార్మికులకు, కర్షకులకు, పిల్లలకు, పెద్దలకు, ఉద్యోగులకు, గొప్పవారికి వీలగునట్లు పర్మనెంటు ఫండు డిపాజిట్లు గలవు.

4. పాలసీదారులు, ఏజంట్లు, పరిపాలనలో పాల్గొనుటకుగాను రెండు స్థానములు ప్రత్యేకింపబడినవి.

5. ఏజంట్లకు వంశపారంపర్య కమీషను పద్ధతులు గలవు.

6. కంపెనీ వ్యాపారము మితవ్యయముతో నిర్వహింపబడుచు, తెలుగులో వుత్తర ప్రత్యుత్తరములు జరుపబడును.

కమీషను పద్ధతి మీదగాని, జీతముమీదగాని పనిచేయుటకు అన్ని ప్రాంతములకు ఏజంట్లు ఆర్గనైజర్లుకావలెను.

వివరములకు—మేనేజింగు డైరెక్టరు పేర కంపెనీకి వ్రాయుడు.

## అతివాద గ్రంథమండలి.

చందాదారులకు

| | |
|---|---|
| 1922 మన్యంలో రైతుల తిరుగుబాటు (అల్లూరి సీతారామరాజు) | 0-12-0 |
| ఇతరులకు | (1-0-0) |
| విలువ, ఖరీదు, లాభము. | 0-5-0 |
| ఇతరులకు | (0-8-0) |
| స్టాలిన్ ఉపన్యాసము. నూతన రాజ్యాంగవిధానం. | 0-5-0 |
| ఇతరులకు | (0-8-0) |
| రానున్నది— 1937 లో మాస్కో | 0-5-0 |
| ఇతరులకు | (0-8-0) |

(పోస్టు ఖర్చులు ప్రత్యేకముగా భరించవలెను.)

వలయువారు:—

సి. వి. సారథి.
మేనేజరు.
అతివాద గ్రంథమండలి.
గుంటూరు.

## ఆదర్శ గ్రంథ మండలి.

కారల్ మార్క్సుది—
కమ్యూనిష్టు కరపత్రం(నిషేధింపబడినది)

లెనిన్ ది—
సామ్రాజ్యవాదము (నిషేధింప బడినది)

| | |
|---|---|
| ఏంజిల్సుది—సామ్యవాద సిద్ధాంతాలు | 0—2—0 |
| మాక్సింగోర్కీది— అమ్మ (నిషేధంపోయింది) | 1—8—0 |
| క్రోపాటకిన్ ది—మనధనం (అయిపోయింది) | |
| టాలుస్టాయిది—కర్షకునికాలగతి | 0—1—0 |
| తుమ్మల వారిది—కామ్రేడ్ డిమిట్రాఫ్ | 0—2—0 |
| లింగయ్యవి—దేవీజోన్ (జీవితము) | 0—8—0 |
| డివేలరా (జీవితము) | 0—8—0 |
| వలసదేశాల సమస్య | 0—1—0 |
| స్టాలిన్—ఉల్విగ్‌తో సంభాషణ | 0—1—8 |

ఆదర్శ గ్రంధ మండలి
యలమర్రు (కృష్ణాజిల్లా)
లేక
నవశక్తి కార్యాలయం,
బెజవాడ, అని వ్రాయండి.



# "కర్షకుని కనులలో జ్యోతి కన్పించిన నాడే భారత దేశానికి శాంతి" —జవహర్‌లాల్ ★

## వివిధ రాష్ట్రాలలో రైతు వుద్యమం

### ఆంధ్ర రాష్ట్రం

కోయలపై కేసులు.

ఈమధ్య తూర్పుగోదావరిజిల్లా, భద్రాచలం తాలూకాలో, రేసుకపాక గ్రామంలో 15 గురు కోయలపై క్రిమినల్ కేసులు పెట్టడం, 9 మందిని ఒక్కొక్క సం॥ జైలుకు పంపడం కూడా జరిగాయి. కాని ఆ అమాయకపు కోయలు పహక్కుల కోసం పోరాడారో ప్రతిఫలంగా వారికి సంభవించిన జైలు ఎందుకో ఆంధ్ర లోకానికి తెలియనేలేదు. అడవాటు సహపంక్తి పాల్గొన్న ఆపోరాటం యొక్క చరిత్ర, వారికి జరిగిన అన్యాయం, అంతా ఆలవిలోనే అంతరించి పోయింది. ఆచరిత్ర ఇది:—

కోమూరు అనే గ్రామంలో రేసుకపాకకు, చెందిన గంగులు, అతని నలుగురు పుత్రులకు కలసి $14\frac{1}{2}$ ఎకరాల సొంతమైన భూమి వుంది. గంగులు ఆభూమిని కర్ణంగారైన యెజ్జు భగవన్నారాయణ గార్కి 5 సం॥ కౌలుకిచ్చారు. సాలుకు 4 బస్తాల జొన్నలు యిచ్చేటట్లు, జమీందారు కివ్వవలసిన పన్ను కోయలతరపున కర్ణంగారే చెల్లించేటట్లు నిర్ణయం. యీకౌలు కాలం పూర్తికాకుండానే గంగులు మరణించారు. మైనరు కొడుకులు కర్ణంగారే పన్ను కడుతున్నారు కదాయని నమ్మకంతో వున్నారు. కాని కర్ణంగారు పన్ను కట్టడం మానివేశారు. జమీందారు భూమిని జప్తుచేయించారు. వేలములో యీభూమిని ఆ కర్ణంగారే రు 42 లకు పాడారు. ఈవేలపు నాటకమంతా ఆరైతులకు తెలియనే తెలియదు. కవులు గడువు 5 సం॥ పూర్తికాగానే తమభూమిలో ప్రవేశించారు. కర్ణంగారు వీరిమీద కేసుతెచ్చారు. డిక్రీ పొందారు. కర్ణంగారు పోలీసు సహాయముతో 3-9-37 తేదీని భూమిని తన స్వాధీనం చేసుకున్నారు. కాని ఇది జరిగిన 20 రోజులకే పోలీసువారు ఆ కోయలను ఇండియన్ పీనల్ కోడ్ 447 సె॥ ప్రకారం ఛార్జిచేశారు. కోయలు ఈ అన్యాయం సహించలేకపోయారు భూమిలోని సస్యం కోసుకుని తీసుకుపోయారు. మళ్ళా I. P. C. 143, 447, 379 సెక్షన్లు ప్రత్యక్షమైనాయి. గవర్నమెంటు ఏజెంటుతో కోయలు తమకు జరిగిన అన్యాయం విన్నవించుకున్నారు. ఆ ఏజెంటు క్రిమినల్ కేసులు అమలు జరపడం మానివేశారు. కాని ఆయన ట్రాన్సుఫరై కొత్త కలెక్టరుగారు వచ్చారు. "రెడ్డివచ్చాడు భాగవతం మొదలాడమన్నారు" మళ్ళీ కోయలపై క్రిమినల్ చార్జీలు, 17-4-38. కోయలు పూర్వచరిత్రంతా కొత్త కలెక్టరుగారికి మళ్ళీ విన్నవించుకున్నారు. కాని కలెక్టరుగారు కోయల ఆక్షేపణ సరియైనదికాదని లా ప్రకారం భూమి కర్ణంగారికే వెళ్ళుతుందని తీర్పు యిచ్చారు. భూమిలో ప్రవేశించవద్దని కోయలను హెచ్చరించారు. కాని కోయలు భరించలేకపోయారు. పాత కలెక్టరు ఒకలాగ చెబితే కొత్త కలెక్టరు ఇంకోలాగ చెప్పడం. వారికిదంతా ఏదోలా కనబడింది.

రైతులమీద పాత సెక్షనులే కాకుండా కొత్తగా 107వ సెక్షను కూడా రగిలించి కేసులు పెట్టారు. ఈ కేసు విచారణ అక్కడే జరిగితే రైతుల కన్యాయం జరుగుతుందనీ, కేసును ప॥ గో॥ జిల్లా కొవ్వూరుకు మార్చవలసిందని కోయల తరపున శ్రీ వుసులూరి కోదండరామయ్యగారు హైకోర్టులో పిటీషన్ పెట్టారు. కేసు అల్లే మార్చబడింది. ముద్దాయీలలో ఒక స్త్రీ కూడా వుంది. విచారణలో 9 మందికి ఒక్కొక్క సం॥ శిక్ష విధించారు, కోయలు తమ అమాయకత్వానికి బలిగా $14\frac{1}{2}$ ఎకరాల భూమిని కోల్పోవడమే కాకుండా జైలు ప్రవాసం కూడా అనుభవించవలసి వచ్చింది.

కాశీపట్నం రైతులపై సెక్యూరిటీ కేసు 5 గురి అరెస్టు.

ప॥ గో॥ జిల్లా, కాశీపట్నం రైతులపై పెట్టిన 107వ సెక్షను జామీను కేసు ది 21—7—38 నర్సాపురం కలెక్టరుగారి వద్ద విచారణ జరిగింది. 11 రు ముద్దాయీలు హాజరైనారు. జామీను ఇవ్వ నిరాకరించారు. మేము తప్పు చేయలేదు. మా న్యాయమైన హక్కు మాకు కావాలి. అని రైతులు ధైర్యంగా సమాధానం చెప్పారు. జామీను రు. 200 నుండి రు. 50 లకు తగ్గిస్తాను ఇప్పుడైనా జామీను యిస్తారా అని మరల కలెక్టరుగారి ప్రశ్న. లేదని రైతుల జవాబు. కలెక్టరుగారు, సబ్ ఇనస్పెక్టరుగారితో 1 గం॥ సేపు సంప్రదించి, 5 గురను అరెస్టు చేయడానికి ఆజ్ఞ వేశారు. ఐదుగురను రిమాండులో నుంచారు. కేసు ఆగష్టు 6వ తేదీకి వాయిదా వేయబడింది.

144 సెక్షను గ్రామమంతా ఇచ్చినందున మేపలు పట్టుకు జీవించేవారికి పను వృత్తికే అడ్డు తగులుతోంది. స్త్రీలు పిల్లలు కూడులేక పూరి గుడిసెలలో మలమల మాడిపోతున్నారు ఇక వారికి విముక్తి లేదా?

నీళ్లు త్రాగనివ్వడం లేదు.

మునగాల పరగణాలో చెరువులలో రైతుల పశువులను నీళ్ళు త్రాగ నివ్వడం లేదని రైతులంతా కలెక్టరుగారికి మెమొరాండంలో మొర పెట్టుకున్నారు. కలెక్టరుగారు క్యాంపుచేసి విచారించి పశువులు నీళ్ళులేక పడుతున్న అవస్థలు చూచి చెరువులలో నీరు త్రాగనివ్వ వలసిందిగా జమీందారు ఉద్యోగస్థులతో చెప్పారు. కాని కలెక్టరుగారు తిరిగి వెళ్ళిపోవడం తరువాయి. జమీందారీ నౌకర్లు నీళ్ళు త్రాగుతున్న పశువులను, పశుల కాపరులగు పిల్లలను బెదరించి, తోలుకుపోయి బందెలదొడ్లో పెట్టారు.

ఆడవారిపై 144.

ముక్త్యాల ఎస్టేటులో చెర్వుకొమ్ముపాలెంలో పోరంబోకులో రైతుల గొడ్లు తిరుగుతూంటే జమీందారుగారి మనుష్యులు వచ్చి, ఆ స్థలం జమీందారుగారి భార్యపేర పట్టా అయిందనీ, పశువులు ఆ ప్రదేశంలో ప్రవేశించగూడదని తిరుగ గొట్టేశారు. అడవిలోకి కూడా తోలుకోనివ్వడంలేదు. పశువులకు పచ్చికలేదు. రైతులీ విషయమై జమీందారుగారి వద్దకు మొరపెట్టుకోడానికి పోతే 87 గురికి 144 సెక్షను ఎదురైంది. ప్రజాశాంతికి భంగకరంగా ప్రవర్తిస్తున్నారని ఆడవారిపై కూడా ఈ సెక్షను ప్రయోగింప బడింది. సుమారు 25 మందిపై కేసులు కూడా పెట్టడానికి చూస్తున్నారని తెలుస్తూంది.

రైతులపై కేసులు.

గంపలగూడెం ఎస్టేటులో జమీందారుకు, రైతులకు జరుగుతూన్న పోరాటం పురస్కరించుకొని, చిట్టేల గ్రామంలో 40 మంది రైతులపై పోలీసులు కేసులు పెట్టారు.

లంచం తీసికొన్న సబ్‌రిజిస్ట్రార్

తిరువూరు సబ్‌రిజిస్ట్రారు రైతులవద్ద లంచాలు తీసికొంటున్నాడని ప్రభుత్వానికి ఫిర్యాదు వెళ్ళింది. మద్రాసు రిజిస్ట్రారు జనరల్ వచ్చి విచారణ సల్పారు. చుట్టుపట్ల గ్రామాల రైతులు విరివిగా సాక్ష్యాలిచ్చారు. ఈకేసు విషయంలో కాంగ్రెసు సంఘం బాగా కృషిచేసింది. ప్రభుత్వం, రైతులోకాన్ని రోజురోజు పీల్చివేస్తున్న లంచగొండి తనాన్ని అన్ని డిపార్టుమెంట్లలోనూ ఈవిధంగానే విచారించి శిక్షిస్తే చాలా బాగుంటుంది.

ఈ దృక్పథం మారాలి.

నెల్లూరు జిల్లాలో వెన్నెలకంటి రాఘవయ్యగారి నాయకత్వాన వ్యవసాయ కూలీయాత్రలు సాగుచున్నట్లు, ప్రతి గ్రామంలోను వ్యవసాయ కూలీల కష్టాలు తెలుసుకుంటున్నట్లు తెలుస్తోంది, ఇంతవరకు బాగానే వుంది. కాని ఆంధ్ర పత్రికలో రాఘవయ్యగారొక ప్రకటన గావిస్తూ "వ్యవసాయ కూలీ సంఘాలు రైతుల సహాయం అపేక్షించుట యందు అర్థంలేద"ని తమ "యాత్ర ఫలితంగా 60 గ్రామాలలో 20 వేల మంది వ్యవసాయ కూలీలు సమ్మె చేయడానికి సిద్ధమవుతున్నార"ని "కలెక్టరువంటి పెద్దమనిషి సమక్షంలో చేసిన రాజీ షరతులకు రైతులు ఒప్పుకోడం లేదు" అని వ్రాశారు. దీనినిబట్టి వ్యవసాయ కూలీలను కేవలం రైతులపైకి రెచ్చగొట్టడమే ముఖ్యంగా పెట్టుకున్నట్లు బోధపడుతుంది.

రైతులకు, వ్యవసాయ కూలీలకు మధ్య ఉండవలసిన సామరస్యంమాట మరచిపోయినట్లుంది. వీరి ప్రచారం మూలంగా కాంగ్రెస్సు వారివల్లనే కూలీలు తమపై తిరుగబడుతున్నారని అచ్చటి రైతులు అపోహపడుతున్నట్లు కూడ వార్తలు వస్తున్నాయి.

వ్యవసాయ కూలీలు తమ హక్కులకోసం పోరాటం సాగించవద్దని ఎవరూ అనరు. కాని రాఘవయ్యగారి ప్రకటనను చూస్తే వారి ఉద్యమం అందుకే సక్రమంగా సాగుతోందని మాత్రం తోచదు. ఈ దృక్పథాన్ని (రైతులకు వ్యవసాయ కూలీలకు పరస్పరం విరుద్ధమని) వారు, వారి సహచరులు కూడా మార్చుకోవాలి. లేనిచో ఆంధ్ర రైతు కూలీ ఉద్యమానికి, భారత స్వాతంత్ర్య పోరాటానికి కూడ తీరనినష్టం కల్గించిన వారౌతారు.

### మద్రాస్

ఋణనివారణ చట్టం.

మద్రాస్ మంత్రివర్గం అమలు జరిపిన వ్యవసాయదారుల ఋణనివారణ చట్టం ఆచరణలో ఎల్లావున్నదీ తెలియపర్చేందుకుగాను 1938 మార్చి, ఏప్రిల్ నెలలలోని లెక్కలు ప్రభుత్వం ప్రకటించింది.

1932 అక్టోబరు నెలకు పూర్వం చేసిన అప్పులకు సంబంధించిన కేసులకు 694 కి ఈచట్టం వర్తింపజేశారు. $3\frac{3}{4}$ లక్షల అప్పు $1\frac{3}{4}$ లక్షలకు తగ్గించబడింది.

అల్లే 1932 అక్టోబరునెల అనంతరపు బాకీలకు సంబంధించిన 673 కేసులకు వర్తింపజేశారు, రు 1,32,217 ల అప్పు రు 93,640 లకు తగ్గించబడింది.

అభివందనాలు.

1346, 1347 ఫసలీల మక్తా చెల్లించకుండా వుంటే, రాబోయే జమీందారీ చట్టంలో, వీటిలో తగ్గింపు వస్తుందనే తప్పుడు అభిప్రాయాన్ని కొందరు రైతులలో కలిగిస్తున్నారనీ, రాబోయే చట్టంలో అటువంటిదేమీ వుండదనీ, వ్యవసాయదారుల సహాయక చట్టంలోవున్న సౌకర్యాలు తప్ప ఎక్కువ వస్తాయని ఆశపడవద్దనీ, 1345 వ ఫసలీ బాకీగాని, అంతకు పూర్వపు ఫసలీల బాకీగాని, చెల్లించినట్లు పరిగణింపబడాలంటే 1347 వ ఫసలీ భాకీ 1938 సెప్టెంబరు నెలాఖరులోగాను, 1346 వ ఫసలీ బాకీ 1939 సెప్టెంబరు నెలాఖరులోగాను చెల్లించబడవలసి వుంటుందని మద్రాస్ ప్రభుత్వ పబ్లిక్ ఇన్ఫర్మేషన్ మంత్రి ప్రకటించారు. త్వరలోనే రైతులోకాన్ని హెచ్చరించినందుకు మంత్రిగారికి అభివందనాలు చెప్పాలి!

### బొంబాయి

సవరణ.

క్రిందటివారం బొంబాయి రాష్ట్ర వార్తలలో రెండవ పేరాలో టెనెన్సీచట్టం జమీన్ రైతులకే వర్తిస్తుందని వ్రాశాం. అదిపొరపాటు. రైత్వారీ ప్రాంతాలలో 100 యకరాలకు పైగాగల భూస్వాముల భూములు కౌలుకు తీసుకొనే వారికి కూడా యీ చట్టం తిరాయితీ హక్కులిస్తుంది, అని వుండాలి. పాఠకులు గమనించెదరు గాక.

(మిగతా 18 వ పేజీలో)

## విజ్ఞప్తి

చందాలు చెల్లించండి!

ఇంతవరకునూ చందాకట్టని చందాదారులు ఈ నెలాఖరు లోపల చెల్లించనిచో పత్రిక ఆగస్టు నుండి పంపబడదు. చందాదారులు తమ చందాను వెంటనే చెల్లించి పత్రికకు సాయపడ వలసినదని ప్రార్థించుచున్నాము.

మానేజరు, నవశక్తి.


# నవశక్తి

27—7—38 బుధవారం


## మధ్య పరగణాల మంత్రుల రాజీనామా.

కాంగ్రెసు రాష్ట్రాలలో మంత్రులు రాజీనామా యిచ్చినారంటే గాని, యిస్తారంటే గాని అదేదో కాంగ్రెసు విధానానికి దేశ శ్రేయానికి సంబంధించిన సమస్య మీదనే అని అనుకుంటాం. కాని మధ్య పరగణాలలో మాత్రం అట్లు జరగలేదు. వ్యక్తిగత వైరాలవల్ల చీటికి మాటికి దెబ్బలాడుకుంటూ ప్రతి చిన్న విషయంలోను ఆలిండియా కాంగ్రెసు పార్లమెంటరీ సబ్ కమిటీ దగ్గరకు ఆలిండియా వర్కింగు కమిటీ దగ్గరకు పరుగులెత్తు తున్నారు. వారు దానిలో జోక్యం కల్గించుకొని అతుకుల మారి రాజీ ఇదివరలో చేశారు. అట్టి రాజీ యొకటి సర్దార్ పటేలుగారి సమక్షాన, ఆయన సలహాపై కిందటిసారి జరిగింది. ఆ రాజీ పత్రము వ్రాసికొన్న సిరా తడి యింకా ఆరలేదు. అప్పుడే లగాదా ప్రారంభమైనది. కాంగ్రెసు విధానానికి సంబంధించినది కాదు. ఏ మంత్రి క్రింద యే శాఖ ఉండవలెనో తేల్చుకోలేక గలాటా వచ్చింది. ప్రధాన మంత్రి ఖరే రాజీనామా యిచ్చి మిగతా మంత్రులను కూడ రాజీనామా ఇమ్మన్నాడు. తక్షణమే మరొక ఇద్దరు మంత్రులు రాజీనామా యిచ్చారు. కాని మహా కోసల మంత్రులు ముగ్గురు కాంగ్రెసు వర్కింగు కమిటీవారి అనుమతి లేన్నిదే తాము రాజీ నిమ్మమని నిరాకరించారు. మంత్రి వర్గానికి జాయింటు బాధ్యత యుండుటచేతను ప్రధానమంత్రియే మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయుటచేతను, ప్రధానమంత్రి రాజీనామా యిస్తే మిగతా మంత్రులు ఇష్టమున్నా లేకపోయినా రాజీనామా యిచ్చితీర వలసిందే అని, అదే చట్ట సమ్మతమైన పద్ధతి అనీ, ఖరేగారి వాదం.

నిజంగా ఆలోచిస్తే జన సామాన్యానికి యీ రెండు వాదాలతోను యేమీ సంబంధం లేదు. స్వాతంత్ర్య పోరాటానికిగాని, ప్రజల దైనందిన హక్కులకుగాని, సంబంధము లేని సమస్యలు వారికి అవసరము లేదు.

కాని కాంగ్రెసు శిక్షణాన్ని కాంగ్రెసు గౌరవాన్ని ఈ సి. పి. మంత్రులు భగ్నం చేస్తున్నట్లు మాత్రం పదేపదే ప్రజలకు స్పష్టమౌతూండడంవల్ల అలజడి మాత్రం కల్గుతోంది. ప్రధాని రాజీనామా యిచ్చి మిగతా మంత్రులను రాజీనామా యిమ్మని కోరితే వారు తప్పక యిచ్చియుండవలసి యున్నది. పోనీ, వారియ్యకపోతే ప్రధాని వారిపై ఆలిండియా పార్లమెంటరీ సబ్‌కమిటీకిగాని వర్కింగు కమిటీకిగాని రిపోర్టుచేసి చర్య జరిపించవలసి యుండేది. అంతేకాని ఏ సామ్రాజ్యాధికారి యగు గవర్నరు దగ్గరకో పరుగిడి, తమ రాజీనామాల నిచ్చివేసి, మిగతా ముగ్గురు మంత్రులను గవర్నరు డిస్మిసుచేయుటకు కారకుడగుట, ఖరేవంటి ఉత్తమ కాంగ్రెసువాడి చేయవలసిన పనికాదు. వెంటనే గవర్నరు అనుజ్ఞతో నూతన మంత్రి వర్గాన్ని అసలే యేర్పాటు చేయవలసి యుండెడికాదు. అందులో ఎల్లుండి ఆలిండియా వర్కింగుకమిటీ మీటింగు తమ రాష్ట్రంలోనే (వార్ధా) జరుగబోతూన్నప్పుడు, అప్పుడే ఆలిండియా పార్లమెంటరీ సబ్‌కమిటీ సభ్యులలో నొకరగు బాబు రాజేంద్ర ప్రసాదుగారు తొందర పడవద్దని ఖరేకు కబురు పంపియున్నప్పుడు అసలే చేయ వలసినది కాదు.

అయితే ఖరే తొందరపడి తప్పుచేసినా వెంటనే తప్పును తెలిసికొని పశ్చాత్తాపాన్ని వెల్లడించేశాడు. కొత్త మంత్రివర్గాన్ని కూడా రద్దుచేసినాడు. వెనుక తంబీ, రాఘవేంద్రరావు గార్లవలెనే ఖరేకూడ చేసి మధ్యపరగణాలకు మాయని మచ్చను తెచ్చారని తలంచిన వారికి మాత్రం పూర్తిగా ఆశాభంగం కల్గింది.

కాని ఇంతటితో ఆగినదా? ఖరేను పార్టీ నాయకత్వానికిగూడ రాజీనామా ఇవ్వమన్నారు వర్కింగు కమిటీవారు. పార్టీసభ నేడే సమావేశము కానున్నది. పార్టీ నాయకత్వానికి, ఖరే పోటీ చేయరాదని వర్కింగుకమిటీ సభ్యుల అభిప్రాయము. కాని ఖరే దానికిష్టపడుట లేదు. తన సోదర మంత్రులపై తప్పంతయు ఉన్నదని తెల్పుచున్నాడు. తనలో సభ్యుల కధిక విశ్వాసము గలదు గనుక తనను గూడ పోటీ చేయనివ్వండని ప్రాధేయపడుచున్నాడు.

వర్కింగుకమిటీ సభ్యులు తమ సలహా మానలేదు. ఖరేగారు కాంగ్రెసు సభ్యుల నాయకత్వమునకు పోటీచేయరాదనే తెల్పిరి. మహాత్ముని సలహాకూడ ఈవిషయమై అడ్డువచ్చుటలేదు. మహాత్ముని అభిప్రాయము కూడా ఖరే తప్పుగావించెను గనుక దానికి ప్రాయశ్చిత్తముగ పోటీ చేయరాదనియే.

ఖరే ఇంకనూ తుది నిర్ణయానికి రాలేదు. నాగపూర్‌లో తన మిత్రులతో ఆలోచించుచున్నాడు.

ఖరే వర్కింగు కమిటీకి బద్ధుడై, తనకు అపకారమో, ఉపకారమో జరిపిరని, వారి యాజ్ఞలను తలదాల్చిన ఎట్టి భయమునకు అవకాశము లేదు. కాని ఖరే దీనికి సమ్మతించునా? ఎక్కువ సభ్యులు తన కనుకూలురని ఆయన అభిప్రాయము. అధికులకు విశ్వాసపాత్రుడగు తాను పోటీ చేయకున్న తానొక రాజకీయ ఆత్మహత్య గావించు కొన్నానని ఆయన భావించును. అంతటితో ఆయన కాంగ్రెస్ పై అధికారులకు లోబడుటా, తిరుగబడుటా అను సమస్య ఆయనకు వచ్చును. కాని ఖరే అంతటి పని కావించడనే మా విశ్వాసము.

ఇంతటితోనే ఈ భయము మానిపోలేదు. శుక్లా (డిస్మిస్ కాబడిన మంత్రి) గారినే ఖరేగారి స్థానే ఎన్నుకొనెదరేమో యని ఒక వార్త. వీరిని ఎన్నుకొనుట గవర్నమెంటుకు జవాబట! గవర్నరుకు దెబ్బట!!

కాని, ఇదే నిజమగుచో, ఇదేమంత సమంజస కార్యమని తలంపము. రెండు పక్షములవారిని పూర్తిగా రద్దుపరచి, ఆందరనూ క్రొత్త మంత్రులను ఏర్పరుచుటో, సమర్థులు లభించరని సంశయము కల్గిన, ప్రాత కొత్త మంత్రుల నుండి ఒక మంత్రివర్గము నేర్పరుచుటో బాగుండును. కాని తగాదాలకు మూలమైన నాయకులనే, ఒకరికి బదులు ఒకరిని తెరపై కెక్కించుట భావ్యముగాదు.

ఏమయినను ఈ సి. పి. మంత్రులగొడవ దేశమును చికాకు పరచినది.

ఈ విషయమై పార్లమెంటు సబ్‌కమిటీ, వర్కింగు కమిటీ, సి. పి. శాసన సభ్యులు తగు నిర్ణయానికి వచ్చెదరు గాక!

మనలో మనకెన్ని భేదములున్నను, సామ్రాజ్యవాదులన్నను, సామ్రాజ్య వాదమన్నను, మనము గర్భ శత్రువులమురా యను మాట అనిపించుకొన వలెను. కాంగ్రెసు ప్రతిష్ఠను కాపాడవలెను. దేశీయ ప్రజలందరూ దానికోసమే వార్ధా వార్తలకై ఎదురు చూచుచున్నారు.



చర్చ

# రైతులకు — వ్యవసాయ కార్మికులకు. మధ్య సామరస్య మెట్లు?

శ్రీ మాదల వీరభద్రరావు

ఇండియాలో వ్యవసాయ కూలీల సంఖ్య రోజు రోజుకు విపరీతంగా పెరుగుతూ ఉన్నది.

ప్రభుత్వపు జనాభా లెఖ్ఖల ప్రకారం మన దేశపు కూలీల సంఖ్య.

1921 లో—2,16,9004

1931 లో—6,97,6277

మన మద్రాసు రాజధానిలో కూలీలు

1921 లో—46,22,565

1931 లో—50,95120

1931 సంవత్సరము నుండి 1938 వ సం॥ వరకు యీ 7 ఏండ్లలో ఎందరో పేద రైతులు దివాలాతీసి సెంటు పొలం లేని కూలీలుగా మారి పోయినారు.

ప్రపంచంలో వ్యవసాయం మీద ఆధారపడ్డ వ్యవసాయ కూలీ సంఖ్య 55 కోట్లు. అధిక సంఖ్యాకులుగా, ఆర్థిక దాస్యం ననుభవిస్తున్న యీ వ్యవసాయ జీతగాండ్ర యొక్కయు, కూలీల యొక్కయు రక్షణకొరకై 1938 సం॥ ఫిబ్రవరిలో జనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సంఘము యొక్క 83 వ సమావేశములో అనేక తీర్మానాలు చేశారు.

### ఆంధ్ర దేశములో కూలీ ఉద్యమము

1929 సం॥లో మైపాడులో 1930 లో పొన్నపూడిలో 1935 లో పూడిపర్తిలో 1936 లో కొండపూడిలో 1938 లో దాదాపు 22 సమ్మెలు జరిగి కొన్ని ఫలించినవి. ముఖ్యముల, వీరులపాడులోను తెనాలి, అమలాపురం, కాళహస్తి, పశ్చిమ గోదావరి మొదలగు వివిధ ప్రాంతాలలో కూలీ సమ్మెలు జరిగినవి. సమ్మెలన్నీ సంఘాల ద్వారా నిర్మాణయుక్తంగా జరిగిన వనుటకు వీలులేదు. చాలావరకు తమంత తామే వచ్చినవే. 1934 సం॥లో నెల్లూరు జిల్లా వ్యవసాయ కూలీ సంఘము ఏర్పడ్డది. తరువాత 1-8-37 వ తేదీ యం. యస్. రాయి అధ్యక్షతను ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘము ఏర్పడింది.

### ఇతర రాష్ట్రాలు

బీహారు రాష్ట్రంలో దాదాపు 50 లక్షల వ్యవసాయ కూలీలున్నారు. 1937 సం॥లో బీహారు రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘము ఏర్పడింది. బెంగాలు, తమిళనాడ్‌లో ప్రయత్నాలు జరుగుచున్నవి. ఈ విధంగా యీ వ్యవసాయ కూలీ ఉద్యమము అఖిల భారత సమస్యగా నుండూ, రాజకీయంగా అభివృద్ధి నొందుచున్నది.

ఒకవైపు భారత దేశ రైతుల తరఫున అఖిల భారత కిసాన్ సభ దాని అనుబంధ సంఘములు తీవ్రగతి తమ కార్యక్రమంతో సామ్రాజ్య వ్యతిరేకంగా ముందుకు నడుచుచున్నవి. [illegible] స్థితిలో వ్యవసాయ కూలీల సంఘాలకు రైతు సంఘాలకు వైషమ్యాలు లేక సామరస్యంగా జాతీయ ఐక్య సంఘటనను (United National Front) ఘనతరం గావించి ప్రభుత్వ ప్రతికూల పోరాటాన్ని సాగించడమెలా? అందుచేత వ్యవసాయ కూలీ సంఘాలకు, రైతు సంఘాలకు ఎట్టి సంబంధ ముండాలి?

ప్రత్యేకంగా గ్రామాల్లో వ్యవసాయ కూలీ సంఘాలు ఉండవలయునని, కాని జిల్లాలో "జిల్లా వ్యవసాయకుల సంఘము"ని ఒకటి ఉండాలని, యీ వ్యవసాయకుల సంఘ నిర్ణయములను గ్రామాల్లోని రైతు సంఘాలు, కూలీ సంఘాలు శిరసావహించ వలయునని సోషలిస్టు పార్టీ కార్యవర్గములోని సభ్యులు కొందరు సూచించారు. దానివల్ల యీ క్రింది చిక్కు సంభవిస్తుంది.

### వ్యవసాయ కూలీ సంఘాలు చాల కొద్ది

రైతు ఉద్యమము కొంత కాలమునుంచి అభివృద్ధి నొందుచున్నది. పాలకొల్లులో జరిగిన సోషలిస్టు పార్టీ సమావేశం నుండే పార్టీ సభ్యులు ప్రత్యేకంగా వ్యవసాయకూలీసంఘాలు ఏర్పాటు స్తున్నారు. అందుచే యింకా ఆరంభ కాలంలోనే యున్నాము. సంఘమును స్థాపించడానికి గ్రామాల్లో అనేక ప్రతిబంధకాలను తొలగించి కొనవలసి వస్తున్నది. కాన వ్యవసాయ కూలీ సంఘాల సంఖ్య చాలకొద్ది.

జిల్లాలోనున్న గ్రామరైతు సంఘములనుండి కార్మిక సంఘములనుండి ఎన్నుకో బడిన ప్రతినిధులందరు గలసి జిల్లా వ్యవసాయకుల సంఘముగా ఏర్పడుదురన్న మాట. కూలీ సంఘాలు చాలా లేనందువల్ల జిల్లా వ్యవసాయకుల సంఘమునకు రైతు ప్రతినిధులే అధిక సంఖ్యాకులుగా (కొన్ని చోట్ల అంతయు రైతు ప్రతినిధులే) వచ్చుట తటస్థించుచుండును. అట్టిచో కూలీలలో పని చేయువారు జిల్లా వ్యవసాయకుల సంఘములో కూలీల హక్కులు చర్చించుటకు అవకాశము లేకుండ పోవుచున్నది. జిల్లా వ్యవసాయకుల సంఘములో సభ్యులు పొందవలెనన్న స్థానికంగానున్న రైతు సంఘాలలోగూడా పనిచేయుదురు. ఒకే సభ్యుడు పరిసర ప్రాంతాలలో నున్న కూలీలలోను, రైతులలోను పనిచేయుటకు విప్లవ వర్గముకోని రెండు భాగాల ప్రజల అభిమానాన్ని ప్రేమను చూరగొనజాలడు. మీదు మిక్కిలి రైతుల్లోను, కూలీల్లోను అపనమ్మకములకు కారణమగును. కాన రైతులలోను, కూలీల్లోను వేర్వేరు సభ్యులు పని చేయుచుండ వలయును. కూలీ సంఘము చాల అవసరము. అందువల్ల కూలీ ప్రతినిధులకు ప్రాతినిధ్యమందుట కష్ట తరము.

అఖిల భారత రైతు సంఘములవలె గ్రామ, తాలూకా, జిల్లా రాష్ట్రముల వారీగా వ్యవసాయ కూలీ సంఘాలుండాలి, కేంద్ర సంస్థ దురుసుగా పనిచేయుచుండాలి, కూలీల దైనందిన కష్టాలను విపులంగా చర్చించడంవల్ల స్థానిక సంఘాలకు అందజేయుచుండాలి. స్థానిక సంఘాలలో సంబంధము క్రమంగా వృద్ధి జేయుటలోను ఉండాలి. స్థానిక సంఘాల స్థితిగతులను ఎప్పటికప్పుడు అభిప్రాయాలను తెలుసుకుంటూ, సిద్ధాంతాలను నిర్ణయించి, దాన్ని విరివిగా క్రింది సంఘాలలో ప్రచారం గావించాలి. అందుకే ప్రత్యేకంగా రాష్ట్ర, అఖిల భారత రైతు సంఘమున్నూ, రాష్ట్ర కూలీ సంఘమున్నూ పని చేస్తుండాలి.

### జాయింటు సమావేశాలు.

ఒక జిల్లాలో కూలీల్లో, రైతుల్లో పనిచేయు ప్రచారకులు కనీసం నెలకొక పర్యాయము సమావేశమై వారి వారి అనుభవాలను గూర్చి చర్చించాలి. పైన ఉండే సంఘాలుగాని, నాయకులు గాని కింది రాజీలు, ఒడంబడికలు గాని చేయునప్పుడు మాత్రాన ప్రజా సామాన్యంలో చోటిడీ చేయు పై వరుసలు మీదను, వడ్డీ వ్యాపారులు, భూస్వాములు, జమీందారులలోను పోరాటం జయప్రదంగా సాగాలంటే ముఖ్యంగా రైతు—కూలీలు సంయుక్త సమావేశాలు ప్రతి ఫిర్కాలో నెల కొకసారి జరిపి ఐకమత్యాన్ని గూర్చి చాకచక్యంగా విపులంగా నచ్చచెప్పాలి. ఎక్కువగా ఫిర్కాసభలు జరుపుతూ ఉండాలి. రైతులు బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో చేయు పోరాటాన్ని కూలీలు బలపరిచి అండగా వుండు రైతులు ఆర్థిక స్థితిగతుల ననుసరించి వ్యవసాయ కూలీల కనీసపు కోర్కెలను అంగీకరించాలి. స్థానిక పరిస్థితుల ననుసరించి తగాదాలను సర్దుబాటుచేయాలి. ఇదే రైతు సంఘాలకు, కూలీ సంఘాలకు ఉండవలసిన క్రింది పునాది.

## మరొక సూచన

శ్రీ ధూళిపాళ్ళ కోటయ్య

రైతులు జాతీయ ఐక్య సంఘటనకు ప్రతికూలురు కాదు. ఐనప్పటికి జాతీయ ఉద్యమముతో అంతగా సంబంధము పెట్టుకోలేక పోయిన కారణములు:—

యిప్పటికి చాలా ప్రతి పల్లెయందు ప్రయివేట్లు ప్రాబల్యం, గ్రామాధికార్ల ప్రాబల్యం ఎక్కువగానే యున్నవి. పైవారు మొదట ఏవిధముగా వారి వారి ప్రాబల్యం యీనాటి వరకు, పేద రైతుల నుంచి వగ్గించా చేసు కొనుచున్నారో, యే కారణముల వల్ల అమాయకపు రైతులు వారి మాటలు నమ్మి జాతీయతకు అభివృద్ధి నిరోధకు లగుచుంటిరో ముందు యోచించవలసి యున్నది. యోచించుటే గాక తన్నివారణకు సోషలిస్టులు మొదలిడవలెను. అప్పుడు తప్పక రైతు ఉద్యమము ఆర్థిక హక్కులతోపాటు జాతీయతకు పోరాడి గమ్యస్థానము చేరగలదు.

యీ పైన చెప్పినవారే గాక, రైతుల జాతీయ వికాసమునకు అడ్డుపడువారు మిత్ర రూపమున కనుపించు శత్రువులు చాలామంది గలరు.

అలాటి విరోధుల బారినుండి తప్పించి జాతీయ ప్రబోధము నిత్యము చేయగల సమర్థులగు సోషలిస్టు, స్థానికముగా గ్రామమునకు, ఒకరయినా తయారు అయి, రైతులకు, ఆర్థికముతోపాటు సాంఘిక రాజకీయాభివృద్ధి కరములగు ఉపన్యాసములను యిష్టాగోష్ఠిగా కనీసము వారమునకు ఒక పర్యాయమయినా యిచ్చుచూ, వారలకు గలుగు యిబ్బందుల తీర్చుచూ అనుమానములను చక్కగా విశదముగా తెలియ చెప్పిన, రైతులందరు జాతీయ పురోభివృద్ధికి ఎంత త్యాగమయిన చేయుటకు సిద్ధ పడుదురు.

ప్రస్తుతం రైతు సంఘములలో పనిచేయు సోషలిస్టులు సభ్యులను చేర్పించి కోటా పూర్తిచేయుటకు మాత్రం అప్పుడప్పుడు గ్రామాలకు వెళ్ళి అర్థముగాని భాషలో చిన్ని ఉపన్యాసములిచ్చి తన పని నెరవేరినట్లు సంతోషించిన ప్రయోజనమేమి? రైతులను యెదుర్కొనుచున్న అనేక సమస్యలతో జాతీయ సంఘటనను ముడిపెట్టుటకు అవకాశము గలదు. అట్టి అవకాశము మనము జారవిడిచిన, పైరైతు విరోధులే మిత్ర రూపమున రైతులు దరిచేరి రైతులను తమ వలలో చిక్కించుకొనుచూ వారివల్లనే జాతీయాభివృద్ధి కరములగు ఉద్యమములకు అడ్డు తగిలించుచుండిరి. అంతేగాక సోషలిస్టుల మీద అసూయ కలిగించుచూ, వ్యవసాయ కూలీ సంఘముల మీద దాడి బయలుదేర తీయుచుండిరి. యీలాంటివి ఆంధ్రదేశమున మిక్కుటముగా జరుగు చున్నందుననే యిప్పటికి వ్యవసాయ కూలీ సంఘములు గల గ్రామమున రైతు సంఘం పెట్టకుండా, రైతు సంఘం గల గ్రామమున కార్మిక సంఘం పెట్టకుండా, కుతంత్రములు చేయగలుగుచుండిరి. లెక్కకు కొద్దిగా అక్కడక్కడ రైతు సంఘము కార్మిక సంఘములు గ్రామములో రెండునూ వున్ననూ, తప్పక అచ్చట రెండు సంఘములు అన్యోన్య సహకారముతో జాతీయ సంఘటనకు సహకారము నలుపుటమాని, ఒక సంఘముతో మరొక సంఘం, నిత్యం, చిల్లర తగాదాలతో కోర్టుల వరకు వెళ్ళవలసి వచ్చుచుండెను. యిట్టి ఘటనలు వారిలో వారికి కలుగుటకు కారణం అచ్చటగల కుతంత్రుల ప్రాబల్యమే. వారివారినుండి తప్పించగల సమర్థులగు, సోషలిస్టులు వేరువేరుగా రెండు సంఘములు

(మిగతా 16 వ పేజీలో)

# ఫెడరేషన్ అంటే?

శ్రీ కంభంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.

కొద్ది కాలములో ఫెడరల్ రాజ్యాంగ విధానం మనదేశంలో రానున్నది. దీనిలో యెట్టి మార్పులు చేయబడవని పార్లమెంటులో ప్రభుత్వ ప్రతినిధులు స్పష్టంగా చెబుతున్నారు. పార్లమెంటుచే సృష్టింపబడ్డ యే ఫెడరల్ విధానమును మేము అంగీకరించము అని కాంగ్రెసు మహాసభ స్పష్టంగా తెలియజేసింది. సుభాష్‌బోసు యొక్క సింహగర్జనలలో యీ నిర్ణయం స్పష్టపడింది. అట్టి ఫెడరల్ రాజ్యాంగ విధానమును గురించి తెలుసుకోవలెనని అనేకులు కుతూహల పడుచున్నందున, అందలి ప్రధానాంశములను గురించి వరుసగా నాలుగైదు సంచికలలో వ్యాసములు ప్రకటించెదము.

—సంపాదకుడు.

### బ్రిటిషువారి పన్నాగం.

1898లో లార్డ్‌కర్జన్ ఈవిధంగా అన్నాడు. "మన సామ్రాజ్యానికి ఇండియా ఒక బంది యిరుసు వంటిది. ఇతర డొమినియన్ దేశాలను మన సామ్రాజ్యం పోగొట్టుకొన్నప్పటికి బ్రతకగలం; కాని, ఇండియాను పోగొట్టుకుంటే, బ్రిటిషు సామ్రాజ్యం అస్తమించి తీరుతుంది."

లార్డ్‌కర్జన్‌యొక్క దైవవాక్యాలే నేటికీ బ్రిటిషు రాజ్యాంగవేత్తల మెదడులో ఉన్నాయి. వారి సామ్రాజ్యం అస్తమించటానికి సహజంగా వారంగీకరించరు. కాని, అస్తమించే రోజులు వస్తున్నాయి. ఈ విషయం వారికి తెలుసు. కనుకనే మనపై యీ ఫెడరేషన్‌ను రుద్దుటకు ప్రయత్నించటం. శాశ్వతంగా భారతీయులను దాసిసత్వంలో ఉంచుటకు ఫెడరేషన్ ఒక పన్నాగం.

### దోపిడీ విధానం

బ్రిటిషు వారు మన దేశానికి వచ్చినప్పటి నుంచీ కొనసాగిస్తూన్న దోపిడీ విధానాన్ని యీ ఫెడరేషన్ ఒక మెట్టుపైకి తీసుకుపోతుంది. వీరి పరిపాలనవల్ల దేశంలో ఆర్థికాభివృద్ధి కలగటం లేదు. ప్రజల పౌరసత్వహక్కులను రక్షణ లేదు. బ్రిటిష్ పెట్టుబడిదార్ల లాభము ననుసరించి 36 కోట్ల మంది ప్రజల జీవితం నిర్ణయించబడుతోంది. బ్రిటిషు సరుకుల విక్రయానికై ఇండియా ఒక మార్కెట్టుగా ఉపయోగపడుతోంది. బ్రిటిషు వారి పెట్టుబడి మన దేశంలో ఎంతో ఉంది. ప్రతి యేటా కొన్ని కోట్ల రూపాయలు ఈ పెట్టుబడిమీద లాభం గ్రేట్ బ్రిటన్‌కు వెడుతోంది. అంతేకాదు. బ్రిటన్‌లోని పెద్ద పెద్ద పరిశ్రమలకు ముడిసరకు లెన్నో కావాలి. పత్తి మొదలైన వాటిని మన దేశంనుంచి ప్రతి యేటా ఎగుమతి చేస్తున్నాం. బ్రిటిషు వస్త్రములను చౌకగా దేశంలో దిగుమతితో, అనేక వందల సంవత్సరాలనుంచి ఉన్నత దశలోఉన్న చేతి పరిశ్రమలన్నీ అధోగతికి వచ్చాయి. అనేక పరిశ్రమలు నాశనమయాయి. వాటిస్థానే ఎక్కువ దేశీయ యంత్ర పరిశ్రమలు నెలకొల్పబడుట కష్టం అయింది.

### పల్లెటూళ్ళలో

చిన్న పరిశ్రమలు నాశనమై, వాటి స్థానే యంత్ర పరిశ్రమలు ఎక్కువగా నెలకొల్పబడ నందున, ప్రజలకు యితర వృత్తులేవీలేక వ్యవసాయంపైనే ఆధారపడవలసి వచ్చింది. 100కి 70 మంది పైగా వ్యవసాయం వల్ల జీవిస్తున్నారు. కాని భూమియొక్క పరిమితత్వంవల్ల కాబట్టి, ఒక్కొక్క రైతుకు కావలసిన జీవితావసరములు కూడా తన భూమివల్ల లభించటం లేదు. అనేక సంవత్సరాలలో వ్యవసాయం వల్ల పెట్టుబడి ఖర్చులు కూడా రావటంలేదు. ప్రభుత్వానికి గాని, జమీందార్లకు గాని చెల్లించవలసిన పన్నుభారం రైతును నానాటికి క్రుంగదీస్తోంది. దీనికి తోడు ఋణభారం ఒకటి. రైతు వ్యవసాయం చేయుట పన్ను చెల్లించుటానికి, ఋణదారుకు వడ్డీ చెల్లించటానికిగా, కనుపిస్తోంది. భూస్వాములకు, షావుకార్లకు, బాకీ ఉన్న సొమ్ము రైతు చెల్లించకపోతే, భూమిని వారు స్వాధీనం చేసుకుంటారు. నేడు దేశంలో జరుగుతూన్నదే యిది: అసంఖ్యాకులైన రైతులు కవులుదార్లుగాను, రోజు కూలీలుగాను మారిపోతున్నారు. భూములన్నీ వ్యవసాయం చేయని భూస్వాములకు వడ్డీ వ్యాపారస్థులకు స్వాధీనం అయిపోతున్నాయి. రైతుకిక మిగిలిన దేమిటి? కావలసినంత దరిద్రం, ఆకలి!

### పట్టణాలలో

ఇది పల్లెటూళ్ళలో నేడు కనుపిస్తూన్న దృశ్యం. పట్టణాలలో కూడా యించుమించు యిదే స్థితి ఉంది. బొంబాయి, మదరాసు, కోయంబత్తూరు, అహమ్మదాబాదు, కలకత్తా మొదలైన పెద్ద పెద్ద పట్టణాలలో పరిశ్రమలు చాలా ఉన్నాయి. వాటిలో పనిచేసే కార్మికులకు ప్రపంచంలో ఎక్కడాలేని తక్కువ జీతాలు యిస్తారు. మితిమీరిన పని చేయిస్తారు. సెలవు లీయరు. మాటిమాటికి డిస్మిసు అంటారు. ఈ కారణాలవల్ల కార్మికులు సమ్మెలుచేసి తాత్కాలికంగా కొన్ని సౌకర్యాలు పొందగలుగుతున్నారు.

ఇక మధ్య తరగతుల ప్రజలేస్థితిలో ఉన్నారో చూద్దాం. నిరుద్యోగం అనే రాక్షసి చేతుల్లో చిక్కి వీరు నానాటికి బీదవారౌతున్నారు. వందలు, వేలు ఖర్చుపెట్టి బి. యే. లు ప్యాసౌతారు; కాని కాలేజీనుంచి బయటకు రాగానే నెలకు రు. 15 ల జీతం కూడా యిచ్చే వాడుండడు.

దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించుట అటుంచి, అణచివేయుటకు కూడా అనేక ఉపాయాలు కనిపెట్ట బడ్డాయి. బట్టల మిల్లులు, ఉక్కు పరిశ్రమ—వీటిలో మాత్రం దేశీయ పెట్టుబడిదార్లు ఎక్కువ ధనాన్ని పెట్టుబడి పెట్టగలిగారు. ప్రధానమైన రైల్వేలు, జనపనార మిల్లులు, బొగ్గు గనులు, బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు—వీటి అన్నిటిలోనూ బ్రిటిషు వారి పెట్టుబడులే. స్వదేశీ పరిశ్రమలలో బ్రిటిషు పరిశ్రమలు విపరీతంగా పోటీ చేస్తున్నాయి. ఎగుమతి దిగుమతి సుంకములు, రైల్వే రేట్లు, మారకపు రేటు మొదలైన అనేక ఉపాయాల వల్ల యీపోటీలో బ్రిటిష్ వ్యాపారస్థులు జయిస్తున్నారు.

కాబట్టి భారత దేశ ప్రజలందరు యేవిధంగా బ్రిటిషు పాలకుల దోపిడికి గురియై ఉన్నారో స్పష్టమయింది.

### రాజ్యాంగ యంత్రం

ఈవిధానాన్ని చిరస్థాయిగా నిలుపుకొనేటందుకు రాజ్యాంగ యంత్రం చక్కగా ఉపయోగపడుతోంది. గవర్నర్లకు, వైస్రాయికి నిరంకుశాధికారము లీయబడ్డాయి. బ్రిటిషువారి వ్యాపారానికి ఆటంకము లేవీ రాకుండా కట్టు దిట్టాలు చేసుకున్నారు. తమ సామ్రాజ్యాన్ని జాగ్రత్తగా రక్షించుకొనుటకు బ్రహ్మరాక్షసివంటి సైనిక దళాన్ని ఉంచుకున్నారు. సైన్యానికి అయ్యేఖర్చు పేద ప్రజలనుంచి పన్నుల మూలంగా వసూలు చేస్తున్నారు. సైనిక శాఖకు ఖర్చు బ్రిటిషు షావుకార్లకు వడ్డీ మూలంగాయిచ్చు సొమ్ము, పోలీసు, సివిల్‌సర్వీసులకు పోగామిగిలినదానిలో ప్రజల ఆరోగ్యానికి, విద్యకు ఖర్చు పెడతారు. ఇది మొత్తం ఖర్చులో చాలా చిన్న భాగం. మొత్తపు ఆదాయంలో 100 కి 6 వంతులు మాత్రమే విద్యకు, 2 వంతులు ఆరోగ్యానికి ఖర్చు పెట్టబడుతోంది.

ఇట్టి దోపిడీ విధానాన్ని యింకా అనేకరెట్లు తీవ్రం చేయడానికే ఫెడరేషన్ ఇండియాలో పెట్టబడుతోంది.

### గవర్నర్ జనరల్

ఫెడరేషన్‌లో గవర్నర్ జనరల్ ప్రధాన పాత్ర. ఇతని పైఅధికారి లండన్‌లో ఉండు ఇండియా సెక్రటరీ. ఫెడరల్ విధానమంతటి పైనను ఇతనికి హద్దులేని అధికారాలు ఈయబడ్డాయి. ఫెడరల్ శాసనసభ చేయు ఏశాసనమైనను అమలు జరుగకుండా చేయుటకు గవర్నర్ జనరల్‌కు సర్వాధికారం ఉంది. శాసనసభలో ప్యాసుకాని యే శాసనమైనను దేశంలో అమలు పరచుటకు గవర్నర్ జనరల్ అధికారాన్ని కలిగియుంటాడు. తన యిష్టం వచ్చినప్పుడు "ఆర్డినెన్సులు" కూడా చేయవచ్చును. క్లిష్టపరిస్థితులలో రాజ్యాంగము నంతటినీ గవర్నర్ జనరల్ రద్దుచేయవచ్చు. ఈవిధంగా 36 కోట్ల మంది ప్రజలపై అతనికి ఏక ఛత్రాధిపత్యం ఈయబడింది.

కార్యనిర్వాహక శాఖకుకూడ గవర్నర్ జనరల్‌దే నాయకత్వం. ఈశాఖలో కూడా అతని అధికారాలకు హద్దులేవీ లేవు. సైన్యం విదేశ వ్యవహారాలు, సంస్థానాధీశులతో సంబంధం—వీటి విషయమై గవర్నర్ జనరల్ స్వయంగా శ్రద్ధ తీసుకుంటాడు; ఇతరులెవరికీ జోక్యం ఉండకూడదు. ఫెడరేషన్ యొక్క ఖర్చులో 100కి 80 వంతులు ఏయే శాఖలకు ఎంతెంత ఈయాలో అతడే నిర్ణయించాలి. మిగిలిన 20 వంతులమీద మాత్రమే శాసనసభకు అధికారం ఉంటుంది. కాని, శాసనసభయొక్క నిర్ణయాలను గవర్నర్ జనరల్ త్రోసి రాజనవచ్చును, "ప్రత్యేక బాధ్యతల"ను పేరుతో అతనికి ప్రభుత్వాపు లన్నిటి పైనను పరిమితిలేని పెత్తనం [illegible]. పూర్తిగా తన యిష్టానుసారం [illegible] పెత్తనాన్ని గవర్నర్ జనరల్ చెలా యించవచ్చు.

స్పష్టంగా చెప్పవలసివస్తే, ఫెడరేషన్‌లో గవర్నర్ జనరల్ ఒక హిట్లర్‌నో, [illegible] నీనో పోలియుంటాడు.

### శాసనసభ.

ఫెడరల్ శాసనసభకు [illegible] అధికారం ఉండదు. సైన్యం [illegible] విదేశ వ్యవహారములలోను శాసనసభ్యుల కధికారం లేదు. 100కి 80 వంతు ఖర్చుపై ఎట్టి అధికారం ఉండదు. గవర్నర్ జనరల్ స్వయముగా దీన్ని నిర్ణయిస్తాడు. శాసనసభ అంగీకరించిన బిల్లును అతడు నిరాకరించవచ్చు. ఫెడరల్ కోర్టుపైగాని, ఫెడరల్ రైల్వే వ్యవహారములు, రిజర్వు బ్యాంకి—వీటిపై కూడ శాసనసభకు యెట్టి పెత్తనం ఈయబడలేదు.

### సంస్థానాధీశులు.

ఫెడరల్ శాసన సభలో ఎట్టివారుంటారో తెలుసుకొంటే, సామ్రాజ్యవాదుల పన్నాగం అంతా బట్టబయలు అవుతుంది. సంస్థాన ప్రతినిధులు సంస్థాన ప్రజలచే ఎన్నుకోబడరు. సంస్థానాధీశ్వరులచే నియమింపబడతారు. ఇట్టివారు ఫెడరల్ శాసన సభలో మూడవ వంతు. కౌన్సిల్ ఆఫ్‌స్టేట్ (అనగా పై సభ)లో 100కి 40 మంది చొ॥న ఉంటారు. వివిధ సంస్థానాల యందలి జన సంఖ్యను యితర రాష్ట్రముల జనసంఖ్యతో పోల్చి చూస్తే, యీ ప్రాతినిధ్యం చాలా యెక్కువ. అంతేకాదు. సంస్థానముల యందలి జాతీయ సంపదనుబట్టి చూస్తే, శాసన సభలలో యింత ప్రాతినిధ్యం ఈయకూడదు. ఫెడరల్ ఖజానాకు వారిచ్చు భాగం కూడా తక్కువే.

శాసనసభ యందలి ఇతర ప్రతినిధులందు మహమ్మదీయుల తరపున కొందరు, క్రైస్తవుల తరపున మరికొందరు, కార్మికుల తరపున మరికొందరు—యీ విధంగా ప్రత్యేక ప్రాతినిధ్యం ద్వారా ఎన్నుకోబడతారు.

బ్రిటిషువారి సహాయం లేకపోతే సంస్థానాధీశ్వరులు ఎప్పుడో ఎగిరిపోయే వారు. వీరి సహాయం లేకపోతే, బ్రిటిషు సామ్రాజ్యం కూడా ఎప్పుడో అస్తమించేదే! అట్టి సంస్థానాధీశ్వరుల ప్రతినిధులకు ఫెడరల్ శాసనసభలలో విరివియైన ప్రాతినిధ్యం ఇవ్వబడుతోందంటే, దీనికి కారణం దేశంలో ప్రజా ఉద్యమం, అంతర్జాతీయ రాజకీయాల్లో బయలుదేరిన క్లిష్ట పరిస్థితులు బ్రిటిషు సామ్రాజ్యవాదులపై విపరీతమైన ఒత్తిడి కలుగ జేస్తున్నాయని చెప్పాలి. ఒకవైపు వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య ఉండే వైరుధ్యాలు ఏవిధంగా ప్రపంచ యుద్ధంవైపు దారి చూపుతున్నాయో మనం చూస్తున్నాం.

రెండవవైపు ఇండియా, పాలెస్టయిన్, వంటి పరాధీన దేశాలలో ఏవిధంగా విప్లవోద్యమాలు విజృంభిస్తున్నాయో చూస్తున్నాం. బ్రిటిషు సామ్రాజ్యవాదులు యితర సామ్రాజ్యవాదులకంటె యెక్కువ అనుభవాన్ని కలిగియున్నారు. తమ ప్రాణ మీదికి వస్తున్న యీ ప్రమాదావస్థను సులభంగా గ్రహించారు. గ్రహించి ఫెడరల్ విధాన ద్వారా భారతీయుల భుజాలపైకెక్కి సవారి చేయుటకు నిశ్చయించుకున్నారు. "ఇండియాను పోగొట్టుకుంటే, సామ్రాజ్యం అస్తమించి తీరుతుంది." అని చెప్పిన కర్జన్ ప్రభువుయొక్క వాక్యాలు బ్రిటిషు రాజ్యాంగవేత్తలు నిమిషానికి వేయి సార్లు భొప్పున జపం చేస్తున్నారు.



# పరీక్ష పత్రాలిచ్చిన ప్రొఫెసర్ పల్టీ కొట్టాడు

## నేటి విద్యావిధానపు అవకతవకలు ★ ★

## విద్యార్థి సంఘాలెందుకు? ★ ★

శ్రీ కాట్రగడ్డ రాజగోపాలరావు

విద్యార్థి సంఘాల యొక్క ఆశయాలనూ కార్యక్రమాన్ని తెలిసికోకుండానే కొంతమంది విద్యార్థి ఉద్యమముపై అపోహలు పడుచున్నారు. అందుకని సమగ్రంగా కాకపోయినా సూత్రప్రాయంగా నైనా విద్యార్థి సంఘాల ఆశయాలను తెలియజేయ పూనుకొంటున్నాము. విద్యార్థుల యొక్క వర్తమాన భవిష్యజ్జీవితాలను సౌఖ్యప్రదంగా చేసికొనుట అనే ప్రధానోద్దేశంతోనే విద్యార్థి సంఘాలు స్థాపించబడుచున్నాయి. వర్తమాన జీవితంలో అంటే విద్యార్థి దశలో ఎటువంటి యిబ్బందులున్నయో, భవిష్యజ్జీవితంలో అంటే విద్యార్థి జీవితం ముగినిన తర్వాత పౌర జీవితంలో ఎటువంటి కష్టాలున్నయో, వాని నన్నిటిని నిర్మూలించి చక్కని సౌఖ్యప్రదమైన జీవితాన్ని సంపాదించుకోడమే యీ సంఘాల ఆదర్శము. విద్యార్థి జీవితంలోని యిబ్బందు లెటువంటివంటే ప్రస్తుతమములలో ఉన్న విద్యావిధానము విద్యార్థుల మెదడులను తినివేయుచున్నదే కాని విద్యార్థులకు ప్రతిఫలమేమీ ఇవ్వటం లేదు. దేశంలో ఏ ప్రభుత్వం అధికారంలో ఉంటుందో, ఆ ప్రభుత్వము తన ఉనికిని స్థిరంగా చేసుకొనేటందుకు అవసరమైన విద్యావిధానాన్నే అమలు పెడుతుంది. నేడు చదువుకొనే వాళ్ళంతా రేపు పౌరు లౌతారు. కాబట్టి వాళ్ళ నందరనూ తనకు దాసులుగా చేసుకోవాలనే తలంపే ఆ ప్రభుత్వానికి ముఖ్యమైనది. ఇందుకు తార్కాణం విద్యార్థులకు నేర్పే హిస్టరీ వగైరాలే.

అందుచేత దేశంయొక్క స్వాతంత్ర్యాన్నీ, సౌష్టవాన్నీ కోరే ప్రతివారూ యీ విద్యావిధానము మార్పించ పూనుకోవాలి. ఇందువలననే నేడు మనదేశంలో కూడా యీ ప్రయత్నమే జరుగుతోంది. నేటి విద్యావిధానానికి ప్రత్యామ్నాయంగా గాంధిగారు మొదలైనవారు వార్ధా విద్యావిధానాన్ని తయారుచేశారు. కాని అది కూడా కాలంయొక్క మార్పుకు అనుగుణ్యంగా ఉన్నట్లు కన్పడటంలేదు. విద్యార్థులను ఇంకా కొన్ని సంవత్సరాలు వెనుకటి కాలంలోకి తీసికొని వెళ్ళటానికే అది తోడ్పడుతోంది కాని ముందుకు తీసికొని వెళ్ళటకు అది తగినట్లుగా లేదు. అందుకు విద్యార్థులు ఆధునిక కాలానికి, ఆధునిక విజ్ఞానాభివృద్ధికి అనుకూలంగా ఉండే విద్యావిప్లవాన్ని తీసుకు రావటానికి ప్రయత్నించాలి. యిదికాక ప్రస్తుత మములలో ఉన్న పరీక్షల పద్ధతి విద్యార్థుల మానసికాభివృద్ధిని అరికట్టుచున్నది. విద్యార్థుల మనస్సుకు ఉల్లాసం, ఉత్సాహం కల్గించే విద్యాలయాలు, పుస్తకాలు ఉంటేనే చదువుకొనేవాళ్ళకు చదువుమీద అభిరుచి కల్గుతుంది. అట్టి అభిరుచి కల్గి చదివినప్పుడు పరీక్షించితే ఆ విద్యార్థియొక్క మానసిక ఆధిక్యత, తెలివితేటలు తెల్లమవుతాయి. అటువంటిదేమీ లేకుండా నేటి పఠనగ్రంథాలు నిర్ణయింపబడుతున్నాయి. పరీక్షలు జరుపబడుతున్నాయి. పరీక్షల్లో ప్రశ్నలిచ్చే దొకరు. దిద్దే దొకరు. ఏ అభిప్రాయంతో ఇస్తున్నాడో, ఏ అభిప్రాయంతో వ్రాస్తున్నాడో, ఏ అభిప్రాయముతో దిద్దుతున్నాడో ఎవ్వరికీ అక్కరంలేదు. మధ్యనుమాత్రం విద్యార్థులు నలిగిపోతున్నారు. ఇందుకొక ఉదాహరణం తెలియజేస్తాము.

ఒక యూనివర్సిటీలో ఒకాయన ప్రశ్నలిచ్చి తానిచ్చిన ప్రశ్నలకు సమాధానాలు వ్రాసి యీ విధంగా వ్రాసినవాళ్ళకు ఈవిధంగా మార్కులు వేయవచ్చునని చెప్పి ప్రశ్నలు దిద్దే ఆయన వద్దకు పంపించాడట. ఆదిద్దే ఆయన దగ్గర పొరపాటున విద్యార్థుల ఆన్సరు పేపర్లలో ప్రశ్నలిచ్చి నాయన వ్రాసి పంపిన ఆన్సరుపేపరు కూడా కలిసిపోయిందట. అది ఆయన చూడక పరుసనే మార్కులు వేసికొస్తూంటే అందరికంటే తక్కువ యీప్రశ్నలిచ్చి నాయనకు వచ్చినాయట. ఇటువంటి స్థితే అన్నిచోట్లా కన్పడుతోంది. ఇంకా కొందరు కోర్సులోలేని విషయాలుకూడా ప్రశ్నలిస్తారు. ఇంకా కొందరు మూలమూలల ఉన్నవాటిని వెదకియిస్తారు. ప్రశ్న లిచ్చేటప్పుడు. విద్యార్థి వ్రాయగల్గిన విషయాలేమిటా అనే దృష్టి ఉంచుకోకుండా ఏవి కష్టంగా ఉంటయ్యో వాటిని ఇవ్వాలని ఏరి ఏరి ఇస్తారు. ఇటువంటివన్నీ నేటి పరీక్షల్లో ప్రత్యక్షంగా అనుభవిస్తున్నవే. ఇంతకంటే విచారకరమైన విషయమేమిటంటే పరీక్షకు కూర్చొన్న విద్యార్థులంతా సమాధానాలు చక్కగా వ్రాసియున్నప్పటికీ నూటికి ఇంత మందికంటె ఎక్కువమంది ప్యాసు కాకూడదనేనియమం ఉండటంవల్ల స్వతహా మార్కులు వచ్చినా విరగ్గోస్తారు. దీనికి తార్కాణంగా మన దేశంలో జరిగినదాన్నే విన్నవిస్తాము. ఒక పరీక్షకుడు ప్రశ్నలకు సరియైన సమాధానాలు ఎక్కువమంది వ్రాయడంవల్ల చాలమందికి వచ్చినయి. వచ్చినట్లే ప్యాసుమార్కులు వేసి యూనివర్సిటీకి పంపించాడట. యూనివర్సిటీవారు వెంటనే "ఇట్లా ఇష్టము వచ్చినట్లు మార్కులు వేయకూడదు. ఇంతమందే ప్యాసు కావాలని నియమముంది కాబట్టి తిరిగి మార్కులు వేయవలసినద"ని పంపించారట. ఆపరీక్షకుడు మళ్ళాచూచి ఇంకా సలుగురైదు గురికి తగ్గించి ఇంతకంటే నాకు చేతగాదని చెప్పి త్రిప్పి పంపించాడట. అప్పుడు యూనివర్సిటీవారు ఇంకొకాయనకిచ్చి మళ్ళీ దిద్దించి మార్కులు విరగ్గోయించారట. ఇది ఎంతటి అన్యాయమో ఆలోచించుకోండి.

ఇటువంటివే పరీక్షల్లో జరిగే అన్యాయాలు, అక్రమాలు ఎన్నో ఉన్నవి. పరీక్షల కోసం రేయింబవళ్ళు కష్టపడి ఎందరో విద్యార్థులు ఆరోగ్యం కోల్పోతున్నారు. ఆరోగ్యం నాశనమయినా పరీక్షల్లో ప్యాసవుతున్నారా అంటే పై కారణాల వల్ల అదీలేదు. అందుకనే కొందరు సోదరులు ఆత్మహత్యలకు కూడా పాల్పడుతున్నారు. అందుకనే ఈ పరీక్షా పిశాచానికి విద్యార్థులు ఆహుతికాకుండా ఉండే ఉపాయం చూసుకోవాలి. ఇంక జీతాల సంగతి మరీ అధ్వాన్నంగా ఉంది. అసలే యీ జీతాలమోత మోయలేని స్థితిలో ఉంటే "గోరుచుట్టు మీద రోకలి పోటన్న"ట్లు మన కాంగ్రెసు మంత్రివర్గం కాలేజీలలో జీతాలు హెచ్చించింది. ఇంటివద్ద తలిదండ్రులు రాత్రింబగళ్ళు కష్టపడి ఒక పూట తిన్నా తినకపోయినా తమ కొడుకు లేదో కష్టాలు తీరుస్తారన్న ఆశతో చదివించ పూనుకొంటారు. కాని జీతాలు మాత్రం భరింపలేని స్థితిలో ఉన్నాయి. ఇది నేడు దాదాపు నూటికి తొంభైమంది అనుభవిస్తున్న స్థితి. యీ జీతాలను తీసికోవటంలో కూడా ప్రభుత్వం కులతత్వాలను చూపిస్తుంది. బ్రాహ్మణేతరుడయి ఆస్తిమంతుడైనా మునసబు దగ్గర సర్టిఫికెట్టు సంపాదించుకొంటే చాలు సగం జీతాలు. బ్రాహ్మణుడయినా నిరుపేద అయినా నిండు జీతాలు కట్టుకోవాల్సిందే. ఇదెక్కడి న్యాయమో అర్థమవటం లేదు. ఇటువంటి కులతత్వాన్ని ప్రభుత్వమే రేకెత్తిస్తోందంటే ఆశ్చర్య పడాల్సిన అవసరమేమీ లేదు. "విభజించి పరిపాలించు" అను సూత్రము బ్రిటిషు ప్రభుత్వానికి ఆదర్శ సూత్రమే కదా? కాబట్టి యీ పద్ధతి పోయేటట్లు విద్యార్థులు ప్రయత్నించాలి. ఈ జీతాలు తీసికొనే పద్ధతిలో గమ్మత్తైనది ఇంకోటి ఉన్నది. స్కూలు ఫైనలు చదివే విద్యార్థి మొదటి సంవత్సరము సగం జీతము కట్టియున్నప్పటికీ, ఒక సంవత్సరము తప్పి రెండవ సంవత్సరము చదవాలనుకుంటే నిండుజీతాలే కాక ఎక్కువగా 0—12—0 కూడా కట్టాలి. క్రిందటి సంవత్సరము బీదవాడైన విద్యార్థి మూడు మాసాలలో ఎలా ఐశ్వర్యవంతుడవుతాడని ప్రభుత్వము యొక్క అభిప్రాయమో అర్థమవటం లేదు. కాబట్టి యీ పద్ధతులన్నీ పోవటానికి సంఘాలద్వారా విద్యార్థులు ప్రయత్నించాలి. ఇంతకంటె వింతైన సంగతి గేమ్సు ఫీ, లైబ్రరీ ఫీ విషయము. విద్యార్థుల శారీరక, మానసికాభి వృద్ధికిని కంపల్సరీగా డబ్బు వసూలు చేస్తారు, వసూలుచేసి పారిశ్రామికంగానూ, వైజ్ఞానికంగానూ విద్యార్థులకేమైనా ప్రతిఫలం ఇస్తున్నారా అంటే సున్నాకి సున్న. డబ్బుమాత్రం బ్యాంకుల్లో పెంచుతుంటారు. గేమ్సు ఫీ తీసికొని ఆటలను అధికారులు ప్రోత్సహించకుండా ఉండటం పోయి ఆట పరికరాలు ఇవ్వమని విద్యార్థులు అడిగితే కళ్ళెర్ర జేస్తారు. లైబ్రరీల్లోకి పోయి చదువుకొందామంటే ఆధునిక సాహిత్యము అందులో కనపడదు. విద్యార్థుల ప్రపంచ జ్ఞానానికి తోడ్పడే సాధనాలలో అగ్రగణ్యమైన పేపర్లనే తెప్పించరు. పొరపాటున ఎక్కడన్నా ఉన్నా చదువుకోటాని కివ్వరు. విద్యార్థుల డబ్బు విద్యార్థుల అభివృద్ధికి ఖర్చుపెట్టడానికే ఇంత కష్టంగా ఉంటే ఎలా బ్రతికేది? అడబ్బే విద్యార్థి సంఘాల వశము చేస్తే ఒక్క సంవత్సరములో శారీరకంగానూ, మానసికంగానూ తమకు ఎంతో అభివృద్ధిని కలుగ జేస్తాయని విద్యార్థుల ఘోష. ఇక టిఫెన్ షెడ్ల సంగతి. పొరుగూరి నుంచి వచ్చే విద్యార్థులకు మధ్యాహ్నం భోజనం చేయటానికి తగిన వసతులు ఏ స్కూలులోనూ ఉన్నట్లు కన్పడటం లేదు. బహిరంగ స్థలంలో భోంచేయ దలచుకుంటారా కుక్కలూ, కాకులూ చుట్టూ మూగుతాయి. అందుకని టిఫెన్ షెడ్లు త్వరలో ఏర్పడేటట్లు సంఘాల ద్వారా ప్రయత్నించాలి. ఇట్లాంటివే విద్యార్థి జీవితంలో సామాన్యంగా, న్యాయంగా ఉండాల్సిన అవసరాలు ఎన్నో ఉన్నాయి.

ఇక పౌరజీవితంలోని కష్టాలు — విద్యార్థి జీవితంలో పరీక్షా పిశాచానికి ఆహుతి కాకుండా అడుగడుక్కి ఎదురొచ్చే యిబ్బందులకు గురి కాకుండా తప్పించుకొని పౌరజీవితంలోకి ప్రవేశిస్తూంటే నిరుద్యోగ రాక్షసి నోరు తెరుచుకొని ఎదురొస్తూ ఉంటుంది. యీ నిరుద్యోగ రాక్షసిని నిర్మూలించటం మాటలతో జరిగే పనికాదు. దీనిని సమూలంగా పెరికివేయ దలచుకొన్నా మన రాజ్యాంగములో సంపూర్ణ పరిణామము తీసికొనిరావాలి. అదే విప్లవం. అందుకనే విద్యార్థులుకూడా రాజకీయాల్లో పాల్గొనాలి అనే వాదం బయలుదేరి స్థిరపరచబడ్డది. రాజకీయాల్లో పాల్గొనాలి అంటే చదువులు మానుకొని రాజకీయ రంగంలో తిరగాలన్నమాట కాదు. అటువంటి పరిస్థితులు ఎప్పుడైనా వస్తేయ్యేమో కాని నేటి పరిస్థితులనుబట్టి మాత్రం అట్లాకాదు. చక్కగా చదువుకొంటూనే అనవసరంగా అల్లరులతో గడిపేకాలాన్ని రాజకీయ కార్యక్రమానికి ఉపయోగించాలనే విద్యార్థి సంఘాల ఉద్దేశము. రాజకీయ కార్యక్రమానికి ఉపయోగించటమంటే ఎవరు రాజ్యాంగ విప్లవానికి హేతుభూతులై యున్నారో, ఎవరు బానిసత్వంలోనే పుట్టి పెరిగి ఉండటంచే బానిసత్వాన్నికూడా గుర్తించలేక దానికే జోహారుకులు కొడుతున్నారో, అలాంటి ప్రజలలో విజ్ఞానాన్ని రేకెత్తించి విప్లవాభిముఖులుగా చేయాలన్నమాట. నూటికి పదిమంది కూడా చదువుకున్నవారు లేని భారతీయ ప్రజలలో విద్యావ్యాప్తి కావించుటకు ప్రయత్నించాలన్న మాట. కులతత్వాలను, మత కలహాలను పోగొట్టుటకు ప్రయత్నించి సౌహార్దాన్ని పెంపొందించాలన్న మాట.

ఇటువంటి ఆశయాలతోనూ, కార్యక్రమంతోనూ పైన వివరించిన ఇబ్బందు లన్నిటినీ నిర్మూలించటానికే యీ సంఘాలు స్థాపించబడుతున్నాయి. విద్యార్థి సంఘాలు బయలుదేరకముందు యీ యిబ్బందులను అర్చేవాళ్ళ, తీర్చేవాళ్ల ఎవ్వరూ కనపడలేదు. యీ ఆశయాలు నెరవేరటానికి అనుకూలమైన కార్యక్రమాన్ని ఎప్పటి కప్పుడు నిర్ణయించుకొని విద్యార్థి సంఘాలు పనిచేస్తుంటాయి. ఇక్కడ సమ్మెలను గురించి విద్యార్థిసంఘాల అభిప్రాయం స్పష్టపరచవలసి ఉంటుంది. సమ్మె అను దానిని అనాలోచితంగానూ, అనవసరంగానూ విద్యార్థి సంఘాలు జరుపుతాయని ఎవ్వరూ అపోహపడకూడదు. మొదట్లో తమకు సామాన్యమూ, న్యాయమూ, అవసరమూ అయిన కోర్కెలను అధికారులకు తెలియజేసి కొంటారు. తెలియజేసి నప్పటికీ లక్ష్యపెట్టకపోతే తాత్కాలికంగా అవసరమైన వ్యవహారముతో

(మిగతా 14 వ పేజీలో)

# "సమ్మెతో స్వాతంత్ర్య రాజ్యము స్థాపనము చేయొచ్చురా" ★ ★

## కార్మిక సమస్యలు

### ఏలూరు

బస్ పనివాండ్ల యిబ్బందులు.

పశ్చిమ గోదావరిజిల్లా మోటారు బస్సులలో పని చేయు డ్రైవర్ల యొక్కయు, కండక్టర్ల యొక్కయు కష్టములు మితిమిరి పోతున్నవి. తాము తీసుకొనివెళ్లె బస్సులలో ఓవర్‌లోడ్ చేయకూడదనే నిబంధనతో మోటార్ పనివాండ్ల సంఘం స్థాపింపబడెను. కాని, ఒకలైన్‌లో ఓవర్‌లోడు చేస్తున్నారని మరొక లైన్ లోనూ, మరొక లైన్‌లో ఓవర్‌లోడ్ చేస్తున్నారని యింకొక లైన్‌లోనూ బస్ యజమానులు పుకార్లు పుట్టించి, యూనియన్‌యొక్క కట్టుబాట్లలో నిలబడకుండా పనివాండ్లను తయారుచేస్తున్నారు. యూనియన్ యిది గ్రహించి, ఓవర్‌లోడ్ చేయుటలోగల హానిని గురించి కరపత్రము లచ్చువేయించి, కండక్టర్లకు డ్రైవర్లకు పంచిపెట్టించినది. అయినప్పటికిని ప్రయోజనం ఉండుటలేదు. ఇచ్చే స్వల్పజీతములు సరిపోక, కండక్టర్లు డ్రైవర్లమీదను, డ్రైవర్లు కండక్టర్లమీదను నేరారోపణచేసి ఓవర్‌లోడ్ చేస్తున్నారు. అంతేగాక, ఈయవలసిన జీతములు నెలకొకసారి సరిగా యజమాను లీయనందున ఓవర్‌లోడ్ తప్పక చేయవలసి వస్తోంది.

మరొక విషయమేమనగా, యీమధ్య డ్రైవర్లచేతను, కండక్టర్లచేతను బస్ యజమానులు కొన్ని అగ్రిమెంట్లు వ్రాయించుకొంటున్నారు. వీటిలోఉన్న షరతులు చూస్తే దక్షిణ ఆఫ్రికాలో నేటాల్ కూలీల షరతులు జ్ఞాపకం వస్తాయి. ఉదా: "నామీద కంపెనీ తాలూకు చెక్కింగ్ యినస్పెక్టర్లుగాని, మేనేజర్లుగాని రిపోర్టులు వ్రాసినయెడల ప్రవేశరుసుము వదలుకొని, కంపెనీవారు తీర్మానముచేసే జరిమానాకున్నూ, కలిగిన నష్టమునకు ముదరా యిచ్చుటకున్నూ నేను బద్ధుడనగుచున్నాను" "కంపెనీవారి తీర్మానమునకు వ్యతిరేకముగా యేవిధమైన దావా తగాయిదాలు తేగలవాడను గాను" "ఈ సర్వీసును విడిచి, కంట్రాక్టు కాలంలో మానుకొని వెళ్లిపోయే యెడలగాని, మీ శెలవులేని రోజులలో గైరుహాజరు అయినయెడలగాని నాప్రవేశ రుసుమును నేను వదలుకొన గలవాడను." "నేను కంపెనీవారి నౌకరీలో ప్రవేశించినది లగాయతు.... సంవత్సరముల వరకు నా స్వయక్తారిని నేను మానుకో గలవాడను కాను."

ఇట్టి అగ్రిమెంట్లపై సంతకములు చేయకపోతే నౌకరీలు దక్కేటట్లు లేదు. నౌకరీ నుంచి యెప్పుడు తొలగిస్తే అప్పుడు వచ్చి పని చేయుటకు అనేకమంది నిరుద్యోగులు నిరీక్షిస్తూ ఉంటారు.

జిల్లా యందలి మోటార్ సర్వీసులలో 40, 50 బస్‌లు ఒకే యజమాని స్వాధీనంలో ఉండుట వల్ల కొన్ని లైన్సుపైద పోటీలుపెట్టి, రేట్లు తగ్గించి, బ్రోకర్లను యేర్పాటు చేసి, ఓవర్‌లోడ్ చేసి, చిన్న యజమానులను పోటీలో ఓడించి, తామే సర్వీసులను ఆక్రమించు కొంటున్నారు. ఆక్రమించుకొని, డ్రైవర్ల యొక్కయు, కండక్టర్ల యొక్కయు జీవితములను అధోగతి పాల్జేయుచున్నారు.

### గుంటూరు.

స్కావింజెర్ల మెమోరాండం.

ఈ మధ్య ప్రధాని రాజగోపాలాచారిగారు గుంటూరు వచ్చినప్పుడు. గుంటూరు మ్యునిసిపల్ స్కావింజర్ల సంఘము తరపున ఒక మెమోరాండం ఈయబడింది. దానిలో, స్కావింజర్లు కోరిన కోరికలలో ప్రధానమైనవి యీ క్రింద వివరించ బడ్డాయి.

1. నెలకు రు. 15 లు కనీస వేతనము.
2. రోజుకు 8 గంటల పని.
3. జబ్బుచేసి నప్పుడు సెలవు: సంవత్సరములో ఒక నెల జీతంమీద సెలవు: గర్భిణీ స్త్రీలకు 2 నెలల సెలవు (జీతంతో సహా): ఆదివారం సెలవు.
4. ఉచితముగా 2 జతల దుస్తులు.
5. ఉచిత వైద్య సదుపాయం.
6. ఉద్యోగాలను ఖాయపరచుట.
7. లంచగొండి తనము మాన్పుట.
8. పరిశుభ్రము చేయు దొడ్ల సంఖ్యను 35 నకు తగ్గించుట.

### ఏలూరు

ప్రెస్ కార్మికుల సమ్మె

మంజువాణి ప్రెస్‌లో ప్రారంభమైన 20 మంది కార్మికుల సమ్మె యింకా సాగుతూనే ఉంది. ఆప్రెస్‌లో యిచ్చిన పనిని యితర ప్రెస్‌లలో కార్మికులు చేయుటకు నిరాకరిస్తున్నారు. ఏలూరు ప్రెస్ కార్మిక యూనియన్ సమ్మెదార్ల కోరికలను వెల్లడిచేయుటకు ఊరేగింపులు, బహిరంగ సభలు, కరపత్రములు మొదలైన మార్గములద్వారా ఆందోళన చేస్తోంది. సమ్మెదార్లకీయవలసిన జీతములను యజమాని యిచ్చివేసి, తిరిగి వారిని పనిలో చేర్చుకోనని పట్టుదల వహిస్తున్నాడు. సమ్మెదార్ల యెడల సానుభూతిని చూపుటకు బెజవాడలో ప్రెస్‌వర్కర్సు యూనియన్ యొక్క యాజమాన్యాన్ని బహిరంగసభలు జరుగుతున్నాయి. ఒక సభలో పట్టణ కాంగ్రెసు సంఘ కార్యదర్శి అయిన శ్రీ యింటూరి వెంకటేశ్వరరావుగారు ఉపన్యసించారు. తెనాలి ప్రెస్ కార్మికులీ సమ్మెకు రు 5-0-0 లు ప్రోగుచేసి పంపించారు.

### చీరాల

ప్రధాని జవాబు

చీరాల కాల్పుల విషయంలో హార్విల్ యిచ్చిన రిపోర్టును గురించి ప్రధాన మంత్రి రాజగోపాలాచారి గారిని గుంటూరు బహిరంగసభలో పలువురు ప్రశ్నించారు. రాజగోపాలాచారిగారి సమాధానము ఏమాత్రమూ సంతృప్తికరముగా లేదు. "ఆరిపోర్టు సరియైనది కనుకనే నేను దానిని అంగీకరించాను. ఈసభలో దానిని గురించి నేను మాట్లాడదలచుకొన లేదు. రిపోర్టుపై ప్రభుత్వం యిదివరకే ఆర్డర్లు జారీ చేసింది. ఇక్కడ ఆవిషయమును గురించి మాట్లాడుట తప్పు అని నా అభిప్రాయం" ఇవి రాజాజీగారి వాక్యాలు.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రిక వ్రాసినట్లు "గుంటూరులో హార్విల్ రిపోర్టుయెడల ప్రజలు కనపరచిన అసంతృప్తిని గురించి ప్రధానమంత్రి చెప్పిన మాటలు సంతోషమును కలుగజేయజాలవు. ఒప్పించుట అసలే చేయలేవు. ప్రతిష్టను కాపాడుకొన వలెనను దృక్పధము లేకుండా, పై అభిప్రాయములను ఆయన సవరణ చేసుకొనవలసి యున్నది."

కార్మికులకు గల యిబ్బందులను గురించి యీ మద్యనే కార్మిక సంఘం తరపున ప్రభుత్వానికి మెమొరాండం ఒకటి పంపబడింది. దాని ననుసరించి, జిల్లా కలెక్టరును విచారణ చేయవలసినదిగా ప్రభుత్వం పంపింది. ఆయన విచారణకు వచ్చి, చీరాలకు ప్రక్కనున్న ఒక గ్రామంలో మకాం చేశాడు. అనేకమంది ఐ. యల్. టి. డి. కంపెనీ కార్మికులు ఊరేగింపుగా అక్కడికి వెళ్ళారు. యూనియన్ యొక్క అధ్యక్ష, కార్యదర్శులు ఊరేగింపును నడిపారు. కలెక్టరుగారు కూడా ఫ్యాక్టరీకి వచ్చి యంత్రశాలల నన్నిటినీ తనిఖీ చేశారు.

చీరాలలో కాల్పులు జరిగిన తరువాత ఫ్యాక్టరీ యజమానులు కొన్ని వందలమంది కార్మికులను పనుల నుండి తొలగించారు. వారి కుటుంబము లిప్పుడు ఆకలి బాధతో మలమల మాడుతున్నాయి. జిల్లా కలెక్టరు యీ విషయమై జాగ్రత్తగా పరిశీలించి, తొలగింప బడ్డ కార్మికులను తిరిగి చేర్చుకొనేటట్లు చూడాలి.

### చిట్టివలస.

ప్రభుత్వ ప్రకటన

చిట్టివలసలో పనివారికి, యజమానికి మధ్యనున్న తగాదాను పరిష్కరింమటకు యస్. వి. రామమోర్తి ఐ. సి. యస్. గారిని ప్రభుత్వం వారు పంపించారు. ఆయన చిట్టివలస వెళ్ళారు. ఇరు పక్షముల ప్రతినిధులతోను మాట్లాడారు. రాజీ కుదురలేదని అభిప్రాయమిచ్చారు. ఇప్పుడు మదరాసు గవర్నమెంటు ఒక విచారణ కమిటీని యేర్పాటు చేయుటకు నిశ్చయించినారట. అయితే, ఆ కమిటీలో ఎవరెవరు సభ్యులో, ఎప్పుడు విచారణ ప్రారంభ మవుతుందో తెలియజేయుటకు పూర్వం సమ్మెదారులు సమ్మెను ముగించి పనులకు పోవాలని ప్రభుత్వ ప్రకటనలో ఉంది.

చిట్టివలసలో రెండు మూడు నెలల నుంచి సమ్మె జరుగుతోంది. ఇతర మార్గములన్ని విఫలమై కార్మికులు సమ్మె ప్రారంభించారు. అయినప్పటికీ, గౌరవ ప్రదమగు రాజీకి మేము ఎప్పుడూ, సిద్ధమేనని కార్మిక సంఘ ప్రతినిధులు మంత్రివర్గానికి మొదటినుంచి తెలియజేస్తూనే ఉన్నారు. సమ్మె త్వరలో ముగియవలెనని ప్రభుత్వం యొక్క

(మిగతా 13 వ పేజీలో)



## మన రాజకీయాలు

# కొరడా దెబ్బలవసరమేనా?

ఫెడరేషన్ ధిక్కారము

"కొన్ని సవరణలలో ఫెడరేషనును అంగీకరించవచ్చునని సిఫార్సు చేయటంవల్ల సత్యమూర్తిగారు ఇండియాలో బ్రిటిషువారి రాజ్యాంగ పద్ధతినుండి యేమియు నేర్చుకొనలేకపోయారని స్పష్టపడింది. లార్డ్‌క్లైవు, వారన్‌హేస్టింగ్సు యీ దేశంలో దిగినప్పటి నుంచీ బ్రిటిషువారు వాగ్దానము లిచ్చుట, వాటిని నెరవేర్చకపోవుట జరుగుతోంది."

అని హెచ్. వి. కామత్‌గారు (రాజీనామా యిచ్చిన ఐ. సి. ఎస్. ఉద్యోగి) ఒక బహిరంగసభలో ఉపన్యసించారు. పార్లమెంటులో ఫెడరేషనును గురించి యీమధ్య కొందరు సభ్యులు ప్రశ్నలడిగారు. ఇండియా సహాయకార్యదర్శి వాటికి సమాధానమిస్తూ, అసలు ఫెడరేషనులో యెట్టి మార్పులూ చేయబడవనియు; బ్రిటిషు సైనికదళమున కయ్యే ఖర్చు ఇండియా భరించి తీరవలసినదేననియు, ఫెడరల్ ఎసంబ్లీకి ప్రత్యక్షపు ఎన్నికపద్ధతి ఈయబడదనియు; పై సభకు ధనముపై ఈయబడిన పెత్తనము క్రింది ఎసంబ్లీకి అసలే ఈయబడదనియు, ఇండియా యాక్టులోని 112 వ సెక్షను మొదలు 117 వ సె॥ వరకు రద్దు చేయబడవనియు స్పష్టంగా, అనుమానమేమీ లేకుండా చెప్పివేశారు. ఇవి సత్యమూర్తిగారు కోరిన షరతులు.

కాబట్టి బ్రిటిషువారు ఫెడరేషను విషయములో అసలు వాగ్దానముచే ఈయదలంలేదు. "ఇయ్యము" అని స్పష్టంగా చెబుతోంటే, సత్యమూర్తివంటి మితవాద నాయకులు అందని పండ్లకు అర్రులుచాస్తున్నారు.

ఫెడరేషను ప్రతికూల దినం.

సత్యమూర్తివంటి కొద్దిమంది మితవాద నాయకుల భ్రమలను అంతమొందించాలంటే ఫెడరేషన్‌ను గురించిన హరిపురకాంగ్రెస్ తీర్మానాన్ని దేశమంతటా కాంగ్రెసుకమిటీలు ప్రచారం చెయ్యాలి. ఒక అఖిలభారత ఫెడరేషన్ ప్రతికూలదినాన్ని నిర్ణయించి, దేశమంతటా అనాడు ఫెడరేషన్ విషయమై బ్రహ్మాండమైన ఆందోళన చేయవలసినదిగా బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీకి సిఫార్సు చేసింది. ఈ సిఫార్సు సరియైన సమయానికివచ్చింది. వర్కింగ్ కమిటీవారు దీన్ని ఆమోదిస్తారని ఆశించవచ్చు. 1937 ఏప్రిల్ 1వ తేదీనాడు యావద్భారతదేశంలో నూతన రాజ్యాంగచట్టానికి విరుద్ధంగా సభలు, ఊరేగింపులు, ఏవిధంగా జరిగాయో యెల్లరికిని తెలిసినవిషయమే. అదే విధంగా, అఖిలభారత ఫెడరేషన్ ప్రతికూల దినంకూడా జయప్రదంగా జరుగుననుటలో సందేహములేదు.

కమ్యూనిస్టు కరపత్రం.

కాంగ్రెసువారిపై పోలీసు హడావిడి ఆంధ్రదేశంలో రోజురోజుకు మితిమీరి పోతోంది. రాజమండ్రిలో తూర్పు గోదావరి జిల్లాలో కొందరు కాంగ్రెసు వాదులచే నడుపబడుతోన్న ఆర్థిక రాజకీయ పాఠశాలలోపలికి సి. ఐ. డి. పోలీసులు వచ్చి, "యిక్కడ నిషేధింపబడ్డ కమ్యూనిస్టు కరపత్రాన్ని బోధిస్తూన్నటు మాకు వర్తమానం వచ్చినది; నిజమా కాదా అని అడిగారట. నిజముకాదని ఆర్గనైజరుగారు సమాధాన మిచ్చారు.

నిమ్యూనిష్టు కరపత్రం ఇంగ్లీషులోనూ ఉంది, తెలుగులోనూ ఉంది. తెలుగు గ్రంధాన్ని మాత్రం పూర్వపు మదరాసు ప్రభుత్వం నిషేధించింది. కాని, యింగ్లీషు గ్రంథాలను విచ్చల విడిగా ప్రతివారూ కొనుక్కొనవచ్చు. ఈ మధ్యనే ఆగ్రా సోషలిస్టు పబ్లిషింగు కంపెనీవారు దానిని ముద్రించి అమ్ముతున్నారు. నిషేధించిన తెలుగు పుస్తకంలో ఒక మాదిరిగాను, నిషేధింపని ఇంగ్లీషు గ్రంథంలో మరొకవిధంగాను ఉండదుకదా! కాబట్టి, వెనుక యెప్పుడో మదరాసు గవర్నమెంటు చేసిన యీ గుడ్డి నిషేధాన్ని యిప్పుడైనా కాంగ్రెసు మంత్రివర్గం రద్దు చేస్తే బాగుంటుంది. లేదా: కాంగ్రెసు ప్రతికూలుర వ్యతిరేక ప్రచారానికి గురికావలసి వస్తుంది.

[illegible]

ఇంగ్లీషులో ఉన్న కమ్యూనిస్టు కరపత్రాన్ని కొనవచ్చు, అమ్మవచ్చు, దగ్గర ఉంచుకొనవచ్చు, బోధించవచ్చు, ఇక: దానియందలి భావాలు ప్రచారం చేయడం తప్పోకాదో చూదాం. అనుభవంగల ఇద్దరు ముగ్గురు హైకోర్టు జడ్జీలు కమ్యూనిస్టు సిద్ధాంతాలను బోధించుట నేరము కాదని స్పష్టంగా చెప్పారు. మొన్న మొన్ననే యు. పి. ప్రభుత్వం యీ విషయాన్ని యింకా గట్టిగా సమర్థించింది. కాబట్టి, కమ్యూనిస్టు సిద్ధాంతాలను ప్రచారం చేయుట తప్పుకాదు. ఒకవేళ రాజమండ్రి ఆర్థికరాజకీయ పాఠశాలల్లో బోధించే విషయాలు "నిషేధింప బడిన తెలుగు కరపత్రము"నుండి కాక, ఇంగ్లీషు గ్రంథములోనివి బోధించిన ఈ శాసన మడ్డురాదు.

ఈ క్లిష్టస్థితినుండి మదరాసు మంత్రివర్గం బయట పడవలసియుంది ఇంగ్లీషు గ్రంథంతో పాటు తెలుగు గ్రంథంపై కూడా నిషేధం లేకుండా చేయాలి.

నిరంకుశ పరిపాలన.

ఇక కాంగ్రెసేతర రాష్ట్రాలలో నిరంకుశ పరిపాలనకు హద్దేలేదు, రాజద్రోహనేరమునకు పంజాబు గవర్నమెంటువారు గనిశంకర్ సింగు గారికి 6 మాసములు కఠినశిక్ష విధించారు, లాహోరుజైలునుంచి ఊటీబ్యాంకికేసు ఖైదీలను విడిచిపెట్టి, పంజాబురాష్ట్రంలో ఉండకూడదని ఆంక్షవిధించారు. తమకష్టాలను చెప్పుకొనుటకై అమృతసర్ నగరమునకువచ్చిన కొన్ని వందలమంది రైతులను లాఠీ ఛార్జి చేసి ఎరస్టుచేశారు. హర్తాల్ జరుపమని బోధించినందుకు ఢిల్లీలో 70 మంది సుప్రసిద్ధ కాంగ్రెసువాదులను ఎరస్టుచేశారు.

బెంగాల్ రాష్ట్రంలో రోజూకొంతమంది డిటెన్యూలను, స్టేట్‌ఖైదీలను విడుదలచేస్తున్నారు. కాని, విడుదలకాబడిన డిటెన్యూలను పోలీసులు, యితరప్రభుత్వోద్యోగులు అనేక యిబ్బందులు పెడుతున్నారు. రాజకీయఖైదీల స్థితినిగురించి, వ్రాసినందుకు ఒక సంపాదకునకు పబ్లిషర్‌కు ఆరు, మూడునెలల చొ॥న జైలుశిక్ష విధించారు,

రాజకీయఖైదీలకు కొరడాదెబ్బలా?

షోలాపూర్‌జైలులో రాజకీయఖైదీలకిచ్చిన కొరడాదెబ్బల శిక్షనుగురించి విచారించుటకు

[illegible]

నియమింపబడ్డ ఉపసంఘమువారు తమనివేదికను బొంబాయిగవర్నమెంటుకు యిచ్చారు. దానిలో వారు జైలుఅధికారులిచ్చిన కొరడా దెబ్బలను సమర్థిస్తూ, యికముందుకూడా రాజకీయఖైదీలకు యీశిక్షఉండవచ్చునని సిఫార్సు చేశారు.

ఈ సిఫార్సు కాంగ్రెసు గవర్నమెంటుచే నియమింపబడ్డ విచారణకమిటీవారిదే అయినపక్షంలో, దానిలో విదేశసామ్రాజ్యవాదుల నిరంకుశ పరిపాలనావిధానం కళ్లకుకట్టునట్లు కనబడుతోంది. ఈసిఫార్సును బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గంవారు అంగీకరిస్తే, కాంగ్రెసుసంస్థ యొక్క బలం అనేకరెట్లు క్షీణిస్తుందని చెప్పాలి. అట్టిపొరబాటును బొంబాయి మంత్రులు చేయరని తలుస్తాం.

శాఖా విభజన.

న్యాయ, కార్యనిర్వాహక శాఖలను రెంటినీ విడదీయుట వెంతో సులభం అంటూ సింధు [illegible]

సిఫార్సు చేశారు. రాష్ట్రమందలి జిల్లాల సంఖ్యను తగ్గించి, ప్రభుత్వోద్యోగుల జీతాలను ఫించనులను కూడా తగ్గించి, కొన్ని అనవసరమైన డిపార్టుమెంటులను ఎత్తివేసి, పబ్లిక్ వర్క్సు యొక్క రిపైర్లకు ఖర్చుతగ్గిస్తే, శాఖావిభజన సాధ్యమవడమే కాకుండా, ప్రభుత్వానికి రు. 40 లక్షలు మిగులుతవని ఉపసంఘంవారు నివేదికలో రుజువు చేశారు.

ఈ సిఫార్సును సింధు ప్రభుత్వం అంగీకరిస్తుందో అంగీకరించదో తెలియదు. కాని, కాంగ్రెసు మంత్రులు అధికారంలో ఉన్న రాష్ట్రములలో యిట్టి ఉపసంఘములను నియమించి, న్యాయ కార్యనిర్వాహక శాఖలను విడదీయుటకు పూనుకొనవలసి యుంది. కాని మన ప్రధాని దానికి అనుకూలంగా లేదు!

రూల్సును రద్దుచేయాలి.

నెల్లూరు, కాకినాడలకు శ్రీరాజగోపాలాచారిగారువచ్చినప్పుడు విద్యార్థులు-రాజకీయములకు సంబంధించిన ప్రభుత్వపు రూల్సునుగురించి కొందరు విద్యార్థులు ప్రశ్నించారు. వాటికి సమాధానం చెబుతూ, రాజగోపాలాచారిగారు "రాజకీయాలలో పాల్గొనవచ్చు; పూర్వపురూల్సు రద్దు చేయబడ్డా" యని పలికారు.

కాని యీవిధంగా రద్దుచేయబడినట్లు ఇంకా నేటి ప్రభుత్వప్రకటనాతే [illegible] పూర్వకంగా

[illegible]

ఉన్నరూల్సును మార్చినట్లయితే లిఖితపూర్వకంగానే ఒక ప్రకటనజేయాలి. కాంగ్రెసు మంత్రులు శాశ్వతంగా అధికారంలో ఉండరు. మరొకరువస్తే, యీరూల్సు మీకాంగ్రెసు మంత్రులుచేసినవేనని ఆకాగితం చూపుతారు. కాబట్టి, ప్రభుత్వపురూల్సును రద్దుచేసుకొన్నట్లు వెంటనే ఒక ప్రకటన చేయాలి.

ముస్లింలీగ్.

సంయుక్తపరగణాల ముస్లింలీగు ఒక సర్క్యులర్ ప్రకటించింది. దానిప్రకారం రాష్ట్రమందలి పబ్లిక్‌బిల్డింగులపై యేసంస్థకు చెందిన పతాకమైనను ఎగురునప్పుడు, ముస్లింలీగ్ సభ్యులు తమలీగ్‌జెండానుకూడా, యెవరి అనుమతిని పొందకుండానే, ప్రతిష్ఠించాలి.

ఇది సంయుక్త రాష్ట్రంలో ముస్లింలీగు తీసుకొన్న కొత్తవైఖరి. ఇతర సంస్థల పతాకములనగా కాంగ్రెసు పతాకమని అర్థం తీసుకోవచ్చు. ఎందువల్లనంటే, యీ మధ్యనే

(మిగతా [illegible] వ పేజీలో)

# ప్రపంచ యుద్ధమే వస్తే భారతీయుల కర్తవ్యం ఏమిటి?

## ఆగస్టు 1వ తేదీ యుద్ధవ్యతిరేకుల దినము.

## ఆనాడు మన కర్తవ్యము మరువరాదు.

శ్రీ తుమ్మల వెంకటరామయ్య

మొత్తము 7.30,00,000 మంది తమ జీవితాన్ని ఏదో విధంగా భగ్నము చేసుకొన్నారు. గృహసౌఖ్యాలను గోల్పోయారు. ఆరోగ్యాన్ని పోగొట్టు కొన్నారు. గాయపడ్డారు. మరణించారు.]

క్రొత్త మార్కెట్లకీ, ప్రాతవాటిని రక్షించు కొనేందుకు, మళ్ళా యుద్ధసన్నాహాలు జరుగుచున్నాయి. బానిస దేశాల స్వాతంత్ర్య సమరాగ్నిని చల్లార్చడానికి, కత్తులుదూసి పదును పెట్టుతున్నారు.

ప్రపంచ సంగ్రామంలో మొదటి దశ 1914—18లో పూర్తి అయింది. రెండవ దానికి సన్నాహాలు జరుగుచున్నాయి. ఈ ప్రపంచ యుద్ధమే అంతరించు మార్గము లేదా? దానికి అంత్యక్రియలు పెట్టు దినమే కనుచూపు మేరలేదా? దానికి జవాబు కాలమే చెబుతుంది. కాని—ప్రపంచ యుద్ధం ఎప్పుడో రాదు! ఇపుడే వచ్చింది!! ప్రపంచయుద్ధం ఎక్కడ? ఎక్కడ? అని మీ ప్రశ్న. ఇథోపియా స్వాతంత్ర్య సమాధిలో. ఆస్ట్రియా స్వాతంత్ర్యాస్తమయంలో........ స్పెయిన్—చైనా—వజీర్‌స్థాన్—పాలస్టయిన్—స్వాతంత్ర్య పోరాటాలలో.

### "ప్రపంచాన్ని మళ్ళా పంచుకోవాలి"

1918 నవంబరు 11వ తేదీన యుద్ధం ఆగిందంటే ఎందువల్ల ఆగింది? రాజకీయ వేత్తల బుద్ధి చాతుర్యాల వల్లనా? కాదు.

సంపద నశిస్తోంది. మానవత్వం నశించి పోతున్నది. అలసిపోయిన ప్రజలే అపారు యుద్ధాన్ని. మిత్రమండలి విజయంకాదు యుద్ధాన్ని ఆపింది. మిత్రమండలి శత్రువుల పతనమే తాత్కాలిక శాంతిని కల్గించింది.

కాని, ఈయుద్ధంవల్ల యూరప్‌లో అకలి హెచ్చింది. దారిద్ర్యం హెచ్చింది. మిత్రమండలికి అపజయం దాపయింది. మరో ప్రక్క రష్యా విప్లవ విజయ నినాదం ప్రపంచానికంతా వినబడింది. నిస్పృహ, తిరుగుబాటు యూరపులో అన్ని పారిశ్రామిక కేంద్రాలలో బుస బుస పొంగింది.

రాజనీతి కోవిదులు—సైన్యాధిపతులు—పత్రికాధిపతులు, నాయకమ్మన్యులు, కొత్తకొత్త నినాదాలు సాగించారు. అమెరికాలో విల్సన్ చేరారు. కొత్తనీతులు బోధించారు. "యుద్ధాన్ని ఆపడానికి" యుద్ధంఅన్నారు. "ప్రజాస్వామ్యం ప్రపంచంమీద రక్షణగా బ్రదకటానికి"అన్నారు. ధనమూ మానవ బలమూ మిత్రమండలికి దొరికింది. రక్షించబడింది.

కాని పరిస్థితులు మారలేదు. తిండిలేదు. యూరప్‌లో మిత్రమండలికి దూరమైపోయిన దేశాలలో మొదట విప్లవాలు రేగాయి. కార్మికులు, సైనికులు మేల్కొన్నారు. తిరుగబడ్డారు. లెనిన్ చెప్పిన "యుద్ధాలను కార్మిక కర్షక స్వాతంత్ర్యానికి" మార్చుకోండన్న వాక్యం ప్రాకిపోయింది.

ఈ విప్లవాగ్నిని చల్లార్చడానికే అన్ని దేశాల రాజకీయవేత్తలు ఫ్రాన్సులో సమావేశమయ్యారు. విల్సన్‌గారి వర్సైల్సు సంధిగావించడానికి గుమిగూడారు.

ఆ సమావేశంలో అమెరికా, ఫ్రాన్సు, బ్రిటన్‌లు గావించిన పనులేమిటి? నిశ్చయించుకొన్న విధానమేమిటి?

(1) మొదట శత్రువులను శాశ్వతంగా అణచేడం.

(2) ప్రపంచంలో నలుదిక్కులా వ్యాపిస్తున్న కార్మిక కర్షక విప్లవాగ్నిని చల్లార్చడం.

(3) ప్రపంచ సంపదను, మార్కెట్లను, అధికారాలను తామే గుత్తకొనుట ద్వారా శాశ్వత శాంతిని నెలకొల్పడం.

ఇదీ ఆనాడు తెరవాటున జరిగిన భాగవతం!

ఆ 'మహా శాంతిసభ' ప్రపంచాన్ని ఒక క్రొత్త అధికారంలో పెట్టి వి. జయించిన దేశాలకు అర్థిక, రాజకీయ అధికారానికి, ప్రాబల్యానికి వర్సైల్సు సంధి దోహదమిచ్చింది. నూతన పోరాటాలకు, తీవ్ర వైరుధ్యాలకు ఇది త్రోవ చూపింది.

"యుద్ధాన్ని తుదముట్టించే యుద్ధం" శాంతికి భంగం కల్గించే 'శాంతి'కి దారితీసింది.

ప్రజా స్వామ్యం అంతరించి యూరప్‌లో కొన్నిచోట్ల ఫేసిజం తలయెత్తింది. నేడు ఫేసిజం అంటే యుద్ధమే. అది ప్రజా స్వామ్యాన్ని నాశనం గావించడానికి, బానిసలను ఇంకా బానిసల గావించడానికి పూనుకొంది. స్వతంత్ర దేశాలను బానిసల గావించి దోపిడి చేస్తుంది. మూడేండ్లలో జరిగిన చరిత్ర చూడండి. అబిసీనియాను మ్రింగివేసింది ఇటలీ. ఆస్ట్రియాను కబళించింది జర్మనీ. స్పెయిను, చైనాలలో, ఇటలీ జర్మనీలు, జపాను, యుద్ధపు చిచ్చును రగిల్చినవి. ఇంతేకాదు. ప్రపంచ కార్మికుల "మాతృభూమి" అనదగు రష్యాను ద్వంసం చేయగా జపాను జర్మనీ-ఇటలీలు సంధి గావించుకొన్నాయి.

జర్మని నాజీపత్రిక మొకటి ఒకసారి ఇలా వ్రాసింది: "జపానుకు రెండే మార్గాలున్నాయి. ఒకటి ప్రస్తుతపు చైనా యుద్ధంతో సంతృప్తిపడి ఊరుకోవడం. రెండు మంగోలియా, టర్కిస్తాను వగైరా దేశాలను ముట్టడించడం. తూర్పు సముద్రాంలో అధికారం వహించి, మంచూరియా నుండి మంగోలియా, టర్కిస్తాన్, ఆఫ్ఘనిస్థాన్ పర్షియా క్రమముగా టర్కీని ముట్టడించడం. దీనివల్ల రష్యా ప్రధానం తగ్గుతుంది. ఇక తూర్పు ప్రాంతాల అమెరికా, బ్రిటను ప్రభావంకూడా తగ్గుతుంది" దీని అర్థం ఏమిటి? ఆసియా, యూరప్‌లలో ఈమూడు ఫేసిస్టు దోపిడి దేశాలు పెత్తనం వహించాలనేగా!

నిజంగా జపాను ఉద్దేశ్యమేమిటి? దక్షిణ మంచూరియన్ రైల్వే అధ్యక్షుడు "మాట్సువోకో" అన్నమాటలు వినండి. "జపాను ఆసియాలో తన పవిత్ర ఉద్యమాన్ని సాగించడానికి త్యాగం చేస్తుందట". అపవిత్ర ప్రచారం ఏమిటి? 1927 టానకా (ప్రధాని) జపాన్ చక్రవర్తికి సమర్పించిన మెమోరాండం చూడండి!

"చైనాను జయించడానికి మొదట మనం మంచూరియా మంగోలియాలను జయించాలి. ప్రపంచాన్ని జయించడానికి మొదట మనం చైనాను జయించాలి"

జపాను బాంబులకు బలియైన చైనా యువతి!

ఇపుడు చైనాపై జపాను యుద్ధం ప్రకటించిన దంటే అర్థం ఏమిటి? బ్రిటన్‌పైన, అమెరికాపైన, ఫ్రాంసుపైన, హాలండుపైన, రష్యాపైన గూడ దెబ్బను కొట్టిందన్నమాటే. చైనాను జయించగల్గితే ఇండియావైపుకు మళ్ళుతుంది. ఫ్రెంచి ఇండో—చైనామీద, డచ్ ఇండోనేషియామీద ఒత్తిడి తెస్తుంది. ఫిలిప్పైన్ దీవులపై ఒత్తిడి, దక్షిణ సముద్రముమీదికి, ఆస్ట్రేలియాకు, న్యూజిలండుకు దారితీస్తుంది. ఇది జపాను మిలటరీ ఫేసిస్టులు కంటున్న కల.

స్పెయిన్‌లోని యుద్ధం ఏమి చెపుతుంది? ముస్సోలినీ హిట్లర్లు ఫ్రెంచివారికి ఆఫ్రికాలోగల హక్కులపై ఒత్తిడి చేయాలని తలుస్తున్నారు. మధ్యధరా సముద్రంలో ఫ్రాంసు బ్రిటనుల హక్కుల భంగపరచాలని చూస్తున్నారు.

నేడు ఆంగ్లో—ఇటలీ సంధి మూలకంగా ముసోలినీ బ్రిటనును ఫేసిస్టుల వైపుకు మొగ్గించాడు. ఇలా బ్రిటన్‌ను బలహీన పరచారు ఫేసిస్టులు. బ్రిటన్‌తోపాటు అమెరికాను బలహీన పరచాలని వారి ఆశయం. అందుకే ప్రాచ్యప్రాంతాల జపానుకు ప్రోత్సాహం. పోతే మిగిలేది ఫ్రాంసు రష్యాలు. చిన్న దేశాలగు జకోస్లొవేకియా వంటి దేశాల స్వాతంత్ర్యాన్ని హరించి (ఆస్ట్రియాను ఇదివరకే హిట్లర్ మ్రింగాడు) ఫ్రాంసుచుట్టూ ఫేసిస్టు బలాన్ని ప్రోగుచేస్తున్నారు. రష్యా ఫ్రాంసులను చీల్చి, రష్యాపై దెబ్బగొట్టాలని చూస్తున్నారు.

ఇలా ప్రపంచాన్ని మళ్ళా చీల్చుకొందామని, మరో మహా సంగ్రామానికి తయారవు తున్నారు.

ఆ ముష్కరులు (ఫేసిస్టులు) మనలను "జయించలేమా—జయించరాదూ" అంటూ ప్రబోధించే. ప్రభుత్వ రక్షణకు ప్రజా సైన్యం అవసరమంటూ తెలిపే స్పైన్ యుద్ధ చిత్రం.

### యుద్ధ సన్నాహాలు

నానాజాతి సమితి యుద్ధాలను ఆపలేక పోయింది. "డిస్ ఆర్మమెంటు" (ఆయుధ విసర్జన) కాన్ఫరెన్సులవల్ల లాభంలేక పోయింది.

జపాను తన నౌకా నిర్మాణ రహస్యాలు తెల్పలేదంటూ అమెరికా 35 వేల టన్నుల నౌకాబలాన్ని నిర్మించుతోంది. అమెరికా నిర్మించుతోందని బ్రిటన్. బ్రిటనునుజూచి ఫ్రాంసు నిర్మింప సాగించినయి. (మరొక పేజీలో వివిధ దేశాల బలాబలాలు చూపుపట్టీ ఇచ్చాం-సం.) ఆయుధ అభివృద్ధికై పోటీలు హెచ్చినయి. బ్రిటిష్ సామ్రాజ్యం తమ వలసదేశాలలో యుద్ధసన్నాహాలు సైనికుల ప్రోగుచేసే ప్రయత్నాలు చేస్తూంది. ప్రపంచ యుద్ధం ఒకమూల ప్రారంభమయింది. అది ఎప్పుడో తీవ్రతరమై ప్రపంచాన్నంతా అలముకొంటుంది.

### యుద్ధంలో మన కర్తవ్యం.

ఫేసిస్టు వ్యతిరేక సంఘాలూ, యుద్ధ వ్యతిరేక సంఘాలూ, సామ్రాజ్య వ్యతిరేకసంఘాలూ, శాంతికాము

(మిగరా ప్రక్క పేజీలో)

ఏ పాపమెరుగని జపాను సైనికులను యుద్ధాలలోకి ఈడ్వడానికి ఇలాంటి ఆకర్షణీయమైన యుద్ధ చిత్రాలు జపాను ప్రకటించు తున్నది.

కాని, యుద్ధంవల్ల అధికమైన పన్నులతో, భర్త లేకపోవడంవల్ల అధిక పరిశ్రమతో, కృంగి కృశించే భార్యా బిడ్డలకు ఇంత ఆనందం ఎక్కడిది?

సామ్రాజ్యవాద యుద్ధాలను కార్మిక కర్షకుల స్వాతంత్ర్య యుద్ధాలుగా మార్చమని సందేశ మిచ్చిన లెనిన్.

శత్రువు నశించేవరకూ, ఇంకా మనుష్యులు, ఇంకా మనుష్యులు అని. ఘోషిల్లిన బ్రిటిష్ వారి యుద్ధ చిత్రం. (1914.).

### "యుద్ధాన్ని అంతమొందించే యుద్ధం."

1914 ఆగస్టు 1వ తేదీ ప్రపంచ యుద్ధం ప్రారంభమయిన దినము. 1918 నవంబరు 11వ తేదీ శాంతి సమకూ దినము.

...లో మరణించి...

మోక్షము మాట ఏమిటి? స్వాతంత్ర్య మెక్కడ కల్గినది? జర్మను అస్ట్రియాకా? బ్రిటిషువారి ఇండియాకా? మాండేటు పద్ధతిని నలుగుచున్న పాలస్టయిన్‌కా? ఫ్రెంచివారి మొరాకోకా? లేదు. ప్రజా స్వామ్యానికి రక్షణ జరగలేదు. బానిస దేశాలకు స్వాతంత్ర్యమూ కల్గలేదు. ప్రజాస్వామ్యము బ్రదకక ఫేసిస్టు రూపం దాల్చింది.

"యుద్ధాన్ని తుదముట్టించడానికి జరిగిన ఈ ప్రపంచ యుద్ధం" నిజంగా యుద్ధాలను ఆపిందా? యుద్ధాలను ఆపే విధానము మిత్ర మండలి సోషలిస్టు రష్యాపై దండెత్తుటా? రూర్‌పై ఫ్రాంసు దండయాత్ర గావించుటా? కోర్ఫుపై ఇటలీ బాంబుల విసరుటా? డెమాస్కస్‌ను ఫ్రెంచివారు నాశనం గావించుటా? చైనాను జపాను విక్రమించుటా? అంతేందుకు? నిన్న మొన్న అబిసీనియాను ఇటలీ మ్రింగుటయా? నేడు ఇటలీ జర్మనీలు కలసి స్పెయినును సర్వనాశనము చేయుటా? వజీర్‌స్థాన్‌లో, పాలస్టయిన్‌లో, బ్రిటిష్ బాంబులు, కత్తులు కటారులు, తుపాకి గుండ్లు విచ్చలవిడిగ ఎగురు మందుటా?

ఏదీ—ఇందులో ఒక్కటీ యుద్ధాన్ని ఆపే విధానం కాదే!

ప్రపంచ యుద్ధం ముగిసింది. కాని "యుద్ధాన్ని ఆపడానికి ఆయుద్ధం" జరగలేదు. అలా తలంచడం ఒక భ్రమ! ఒక తంత్రం!! కాని గడచిన ప్రపంచ యుద్ధం, జరగబోయే మహా సంగ్రామాలలో ఒక భాగం. పెట్టుబడిదార్ల - వర్తకుల

...నృత్యాలలో!

[కాని ప్రొఫెసర్ నికొలస్ ముర్రే బట్లర్ గారి అంచనా ఇది.

గత ప్రపంచ యుద్ధానికి ఖర్చు 1,20,000 కోట్ల రూపాయలు.

ఇంత డబ్బు ఖర్చుపెట్టి ప్రపంచం గడించిన ఫలితం ఏమిటి?

1,00,00,000 మంది సైనికులు చనిపోయారు.

30,00,000 మంది సైనికులు పత్తాలేరు.

1,30,00,000 మంది పౌరులు, యుద్ధంలో పాల్గొనని వారు, మరణించారు.

2,00,00,000 మంది గాయపడ్డారు.

30,00,000 మంది ఖైదీలు.

90,00,000 మంది అనాథ శిశువులు.

50,00,000 మంది వితంతువులు.

1,00,00,000 మంది తల దాచుకోడానికి విదేశాల పాలైనవారు.



# ఆయా దేశాల బలాబలాలు

| దేశం | జనసంఖ్య | సమకూర్చగల సైన్యం | కాల్బలం | నావికా బలం | యుద్ధ విమానాలు | వైమానికులు | ఆఫీసర్లుగా వున్న వైమానికులు |
|---|---|---|---|---|---|---|---|
| బ్రిటన్ | 47,098,000 | 9,000,000 | 115,000 | 1,296,353 టన్నులు అందులో 23 యుద్ధనావలు, 11 విమానాలను మోసే ఓడలు, 76 క్రూయిజర్లు, 162 టార్పెడోవిధ్వంసకర్లు, 72 సబ్‌మెరైన్లు, వున్నాయి | 2,000 | 65,000 | 5,500 |
| ఫ్రాన్సు | 41,906,000 | 8,900,000 | 415,000 | 511,817 టన్నులు. అందులో 9 యుద్ధనావలు, 3 విమానాలను మోసే ఓడలు, 78 టార్పెడో డిస్ట్రాయర్లు, 86 సబ్‌మెరైన్లు, 2 క్రూయిజర్లు వున్నాయి. | 1,500 | 50,000 | 3,000 |
| అమెరికా | 128,430,000 | 20,000,000 | 190,000 | 1,163,240 టన్నులు. అందులో 19 యుద్ధనావలు, 6 విమానాలను మోసే ఓడలు, 40 క్రూయిజర్లు, 252 టార్పెడో డిస్ట్రాయర్లు, 107 సబ్‌మెరైన్లు. | 2,800 | 32,000 | 2,800 |
| రష్యా | 170,000,000 | 35,000,000 | 1,300;000 | 250,000 టన్నులు అందులో 6 యుద్ధనావలు, 8 క్రూయిజర్లు. 25 టార్పెడో డిస్ట్రాయర్లు, 150 సబ్‌మెరైన్లు. | 4,500 | 100,000 | —— |
| జర్మనీ | 67,165,000 | 13,000 | 1,000,000 | 117,271 టన్నులు. అందులో 10 యుద్ధనావలు, 2 విమానాలు మోసే ఓడలు, 13 క్రూయిజర్లు, 62 టార్పెడో డిస్ట్రాయర్లు, 59 సబ్‌మెరైన్లు. | 2,600 | 130,000 | 5,500 |
| జపాన్ | 71,000,000 | 16,000,000 | 400,000 | 802,262 టన్నులు. అందులో 11 యుద్ధనావలు, 7 విమానాలను మోసే ఓడలు, 38 క్రూయిజర్లు, 127 టార్పెడో డిస్ట్రాయర్లు, 62 సబ్‌మెరైన్లు. | 1,670 | 21,000 | 6,000 |
| ఇటలీ | 42,801,000 | 8,000,000 | 550,000 | 429,243 టన్నులు. అందులో 8 యుద్ధనావలు, 2 క్రూయిజర్లు, 156 టార్పెడో డిస్ట్రాయర్లు, 111 సబ్‌మెరైన్లు. | 2,200 | 50,000 | 5,000 |

ఈ లెక్కలన్నీ ఫ్రెంచి రచయిత్రియగు మేడం టేబూ ఇచ్చింది. (1938 మార్చివరకు మాత్రమే ఇవి.) ఇంకా నిర్మాణంలోనున్న సంఖ్యలను ఈమె ఇందులో కలపలేదు.

## ప్రపంచ యుద్ధం వస్తే మన కర్తవ్యం

(11 వ పేజీ తరువాయి)

లూ యుద్ధాలు వద్దంటూ ప్రచారంచేస్తున్నారు. యుద్ధాలకు మూల కారణమైన సామ్రాజ్యవాదాన్ని, ఫేసిజాన్ని, రూపుమాపాలంటున్నారు. నేడు నెహ్రూపండితుడు కూడ యీ దివ్య సందేశాన్నే యూరప్‌లో, ప్రతిచోటా, ప్రజల కందిస్తున్నాడు.

ఫైజపూర్, హరిపూర్, కాంగ్రెసులలో, సామ్రాజ్యవాదుల యుద్ధాలలో మనం పాల్గొనమని భారతీయుల దృఢ నిశ్చయం తెల్పాము. కాని అంతటితో మన కర్తవ్యం పూర్తి కాలేదు.

కాంగ్రెసేతర రాష్ట్రాలలో అమాయక ప్రజలను సైన్యాలలో చేర్చడానికి ప్రచారం సాగుతోంది. మన కాంగ్రెసు రాష్ట్రాలలోనూ బ్రిటిష్ ప్రభుత్వం తన పనిని మానలేదు. మనము ఈ నాడు తగినంత యుద్ధ వ్యతిరేక ప్రచారం చేయకపోతే, దెబ్బతింటాం.

మన తీర్మానాలను బుట్టదాఖలా చేసే లాఠీలు, తుపాకి గుండ్లు, ఆర్డినెన్సులు సామ్రాజ్యవాదానికి ఎన్నో ఉన్నాయి. యుద్ధంప్రారంభంకాగానే 'మార్షల్‌లా' ఒకటి నెత్తిన పెద్దుతారు.

యుద్ధంలో 'చావు' అంటే చావాల్సిందే. మన వీపుల వెనకాల, మన గుండెల కెదురుగా తుపాకులు ప్రత్యక్షమాతూనే ఉంటాయి వద్దని చెపితే. ఇదివరకటి రోజులు పోయాయి. పూర్వం బ్రిటన్‌కు సహాయం గావించి పొరపాటు చేశారు నాయకులు. 25 వేల సైనికులను తప్పుడు త్రోవ పట్టించారు. కాని నేడు పరిస్థితులు మారాయి. ప్రపంచ యుద్ధమేవస్తే మనమేంచేయాలో ఫైజ్‌పూర్ హరిపూర్ తీర్మానాల ఆధారంచేసుకొన్ని గ్రామగ్రామాన సంఘాలు స్థాపించి, ప్రచారం గావించాలి. ప్రచారంలో ఈ క్రింది అంశాలు గమనించాలి.

(1) యుద్ధాలకు కారణాలు, సామ్రాజ్యవాదుల నిజమైన ఆశయాలు—యుద్ధాలవలన ఫలితం. మనం సహాయం చేస్తే ముప్పు—వీటిని బోధించడం.

(2) యుద్ధ తత్వాన్ని ఎందుకు ప్రతిఘటించాలి ? స్వాతంత్ర్యానికి అది ఎలా అడ్డు తగులుతుంది అనే వాటిని విశదీకరించి తెల్పటం. సామ్రాజ్యవాదంతో యుద్ధసమయంలో సంధి చేసికొను వారిని బయటపెట్టడం.

(3) సామ్రాజ్యవాదం, ఫేసిజం అన్నదమ్ములనీ, ఇవే యుద్ధాలని ప్రేరేపించునవనీ; సామ్రాజ్య వ్యతిరేకపోరాటమే శాంతికై పోరాడుననీ; స్వాతంత్రంగానీ, సోషలిజంగానీ రావాలంటే యుద్ధాలను ఎదుర్కోవాలనీ తెల్పటం.

(4) ఒకవేళ యుద్ధమేవస్తే దానిని స్వాతంత్ర్యానికి ఎలా ఉపయోగించుకోవాలి; అనేవిషయాన్ని ప్రబోధించడం.

(5) ఆయుధసామగ్రిని తయారుచేసే ఫ్యాక్టరీలలోని ఓడరేవుల యందలి కార్మికులను నౌకాస్థలాలు, కార్మికులను, రైల్వే కార్మికులను ఆర్గనైజు చేసి, యుద్ధం వస్తే సమ్మె చేయుటకు ప్రయత్నించడం.

(6) ప్రతి పల్లెలోను, వివిధ జాతీయ శక్తులన్నీ కలిసి ప్రచారంచేస్తూ బ్రిటిష్ ప్రభుత్వానికి అంగ, అర్థబలములను నిరాకరించడం.

ఈ ప్రచారం కావించడానికి చక్కని అదను ఆగస్టు ఒకటవ తేదీ. ఆగస్టు 1వ తేదీ యుద్ధప్రతికూల దినము. ఆ దినాన్ని సవ్యంగా యుపయోగించడానికి సామ్రాజ్య వ్యతిరేక సంఘాలన్నీ ప్రయత్నించాలి.

సామ్రాజ్యవాద యుద్ధాలు నశించుగాక!
వలస రాజ్యాల దోపిడీ అంతరించుగాక!!
స్వాతంత్ర్య భారతికి జై!!!

## మన రాజకీయాలు

(9 వ పేజీ తరువాయి)

ముస్లింలీగ్ కాంగ్రెసు సంస్థలకు సంధి ప్రయత్నాలు జరిగి అవి భగ్నమయాయి. యీవిధంగా ముస్లింలీగు సభ్యులు జబర్దస్తీతో ప్రవర్తిస్తే తమ పతాకమును తామే అవమానపరచు కొంటున్నారని అర్థం. పుట్టినప్పటినుంచీ ప్రతి జాతీయోద్యమాన్నీ వ్యతిరేకిస్తూ వచ్చిన ముస్లింలీగ్‌యొక్క ఈ వైఖరి, సంయుక్తరాష్ట్రంలో, సత్యాగ్రహం చేస్తామని బెదరించే జమిందార్లవైఖరీ, చూస్తేజాతీయ ప్రతికూల శక్తులన్నీ ఏకమవుతున్నాయని స్పష్టమవుతూంది.

ఇప్పటికైనా, లీగ్ నాయకులతో సంప్రదింపుల వ్యామోహము మాని, కాంగ్రెసు నాయకులు ముస్లిం జన సామాన్యం యొక్క దైనందిన హక్కులకై, తీవ్రంగా పోరాడాలి.

క్రిమినల్ లా సవరణ చట్టమురద్దు.

క్రిమినల్ లా అమెండ్‌మెంటు ఆక్టును రద్దుచేయుటకు మదరాసు శాసనసభలో టి. టి. కృష్ణమాచారి అను కాంగ్రెసేతర శాసన సభ్యుడు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించ దలచు కొన్నాడు. వి. రామదాసు పంతులు, రుక్మిణీ లక్ష్మీపతి, కె. భాష్యంగారలు, వీరి ప్రతిపాదనకు పూర్తిగా అంగీకారాన్ని తెలిపారు.

ఈ శాసనాన్ని యిదివరకు ప్రతి రాష్ట్రంలోను సత్యాగ్రహం రోజుల్లో అమలు జరిపారు. అప్పటి అసాధారణ పరిస్థితులు యిప్పుడులేవు. అంతేగాక, ప్రభుత్వం యొక్క నిరంకుశ శాసనాలలో ఇది ఒకటి. ఇట్టి శాసనాలను రద్దు పరచుట కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో ఒక అంశము. కాబట్టి యింతకు పూర్వమే కాంగ్రెసు ప్రభుత్వం దీన్ని రద్దు చేయుటకు స్వయంగా కృషిచేయాల్సింది. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రిక వ్రాసినట్లు "కృష్ణమాచారిగారు కాంగ్రెసువాది కాదు. కాని ఆయన బిల్లులో నిజమైన కాంగ్రెసు తత్వం ఉంది. ఈ విధంగా కాంగ్రెసేతర సభ్యులే తమకంటె ముందుకు పోవడం కాంగ్రెసు సంస్థయొక్క బలహీనతను తెలియజేస్తోందని మంత్రివర్గం గ్రహించాలి"



## కార్మిక సమస్యలు

(8 వ పేజీ తరువాయి)

అభిప్రాయమే అయితే, మొదట్లోనే ఒక విచారణ కమిటీని నెలకొల్పవలసి యుండేది. అట్లు చేయక, రెండు నెలల అనంతరం యస్. వి. రామమూర్తి గారిని ఐ. సి. యస్. ఉద్యోగిని తగాదాను పరిష్కరించుటకు పంపిరి. ఆయన ప్రయత్నాలు విఫలమయాయి. ఇప్పుడైనా త్వరలో విచారణ కమిటీని యేర్పరిస్తే బాగుండేది. కాని, సమ్మెను ఆపివేయాలి అని షరతును ప్రకటించుట వల్ల సమ్మెదార్లకు నిజంగా నష్టము చేసిన వారౌతున్నారు.

## మదరాసు.

బట్టలమిల్లు కార్మిక సమ్మె

చూళై బట్టల మిల్లులలో సమ్మె సుమారు 1 నెల జరిగింది. కార్మికులకు యెక్కువ జీతములకై సమ్మె ప్రారంభింప బడింది. సమ్మెకు పూర్వం ఒక పరిష్కార సంఘం నియమింప బడింది. కాని, ఆ కమిటీవారు మిల్లు యజమానులు చూపిన జమాఖర్చుల పుస్తకాలను నమ్మి కార్మికులకు ఎక్కువ జీతములిచ్చుటకు అవకాశం లేదని తీర్మానించారు. ఆ చూపిన ఎక్కౌంట్లు సరియైనవి కాదని కార్మిక ప్రతినిధులు వాదించారు. చివరకు సమ్మెను ప్రారంభించారు. నెల వరకు సమ్మె సాగింది. ఇప్పుడు మదరాసు గవర్నమెంటు ఒక ఆఫీసర్‌ను నియమిస్తారు; ఆయన నిజమైన జమాఖర్చులను కనిపెట్టి సమస్యా పరిష్కారం చేస్తారు. అప్పటి వరకూ కార్మికులు సమ్మెను ఆపివేసి పనులలోనికి పోవలసిందని ప్రభుత్వం ప్రకటించింది. వెంటనే యూనియన్ సమ్మెను నిలిపివేసింది. అందరూ పనులకు పోయారు.

పరిష్కార సంఘము చేయలేని పని యీ ఆఫీసర్‌గారు చేస్తారేమో చూడవలసి యుంది. సమ్మెదార్లు మాత్రం "ఎట్టి షరతులు లేకుండా" సమ్మెను ఆపివేశారు. ఇలాంటి సహకారం కార్మికులు కాంగ్రెసు ప్రభుత్వానికి మొదటనుండీ చూపెడు తున్నారు.

అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ కార్మికులు.

సుమారు 70 రోజుల నుంచీ వెస్టెరన్ ఇండియా స్వ్యాక్ కంపెనీలో సమ్మె జరుగుతోంది. సమ్మెదార్లు గవర్నమెంటు భవనం యెదుటకు ఊరేగింపుతో వచ్చి తమ కోరికలను ఎరుకపరచారు.

ఇంతవరకును ఒక విచారణ కమిటీని గాని, పరిష్కార సంఘాన్నిగాని ప్రభుత్వం నియమించలేదు.

## కోయంబత్తూరు

యజమానుల హడావిడి

కోయంబత్తూర్ మిల్లుల తగాదాలను గురించి విచారించుటకు పంపబడిన లేబర్ కమిషనర్ స్టాత్రీ గారు తన రిపోర్టును ప్రభుత్వానికిచ్చారు. ఆగస్టు మొదటివారంలో ప్రభుత్వ నిర్ణయం వస్తుంది. కాని, యీలోగానే మిల్లు యజమానుల హడావిడి యెక్కువౌతోంది. కార్మికులలో ఆందోళన తీవ్రంగా జరుగుతోంది. రోజు వేలకొలది కార్మికులు ఊరేగింపులు, సభలు చేస్తున్నారు. 16-7-38 వ తేదీన సభ జరుగుతోంటే లక్ష్మీ మిల్లులోనుంచి యజమానుల మనుష్యులు రాళ్లు రువ్వారు. ముగ్గురికి తీవ్రమైన గాయములు తగిలాయి. సభలు చేసుకొంటున్న కూలీలపై దౌర్జన్యము జరుపుతూన్న యజమానులపట్ల అసంతృప్తి తీవ్రముగా వ్యాపిస్తోంది. కోయంబత్తూరుకు 10 మైళ్ల చుట్టుప్రక్కలలో కార్మికుల సభలు, ఊరేగింపులు జరుగకుండా చేయాలని యజమానులు జిల్లా అధికారులకు తెలియజేశారు. రాధా కృష్ణ మిల్లులలో కొంతమందిని అనవసరంగా పనినుండి తొలగించారు. వెంటనే ఆ మిల్లులలో మళ్ళా సమ్మె ప్రారంభ మయింది.

గవర్నమెంటు నిర్ణయం వచ్చేలోగానే యెందుకో ఈ యజమానుల తొందర? ప్రభుత్వాన్ని కంగారు పెట్టుటకేనా?

## కెన్ననూర్

కార్మిక వాలంటీర్ల దళం

మలబార్‌లోఉన్న సుమారు 10 కార్మిక సంఘముల తరపున ప్రతినిధులు కెన్ననూర్‌లో సమావేశమై కార్మికుల నుండి కొంతమందికి వాలంటీర్ శిక్షణ యిచ్చుటకును, యీమధ్య రాష్ట్రి కాంగ్రెసు కమిటీ వారివద్ద సర్టిఫికేట్లు పుచ్చుకొన్న వారిలో ఒకరిని కెప్టెన్‌గా నియమించుటకున్ను తీర్మానింప బడింది. మొదటి వాలంటీర్ దళంలో 100 మంది చేరారు.

## బెంగాల్

హుగ్లీ జనపనారమిల్లు కార్మికుల మహాసభకు శ్రీమతి సరోజనీ నాయుడుగారధ్యక్షత వహించారు. సుభాష్‌బోసుగారు మహాసభలో ఉపన్యసించారు. కార్మికులకు సంబంధించిన అనేక తీర్మానాలు చేయబడ్డాయి. ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా సుభాష్‌బోసు తీసుకున్న వైఖరిని అభినందిస్తూ, సత్యమూర్తి ప్రభృతులను ఖండిస్తూ ఒక తీర్మానం చేయబడింది.

జయర్‌గోరా బొగ్గుగనులలో ప్రారంభమైన సమ్మె జయప్రదంగా జరుగుతోంది.

కుల్టీ, హీరాపూర్ ఉక్కు పరిశ్రమాలయంలో కార్మికులు 46 రోజులు సమ్మెచేసి, చివరకు యజమానులతో రాజీపడ్డారు. డిస్మిసుచేయబడ్డ పనివారిని తాత్కాలికంగా పనిలో చేర్చుకొనుటకును; గవర్నమెంటుచే నియమింపబడు పరిష్కార సంఘంయొక్క నిర్ణయము ననుసరించి వారిని తొలగించుటకును యజమానులు అంగీకరించారు. సమ్మెదార్లు వెంటనే సమ్మెను ఆపివేశారు.

సెట్రలోనాలో జనపనార బేళ్ళను లాగు బండ్లవాళ్ళు, కూలీలు హఠాత్తుగా సమ్మెచేశారు. స్థానిక కాంగ్రెసు కమిటీ నాయకులతో సబ్ మేజిస్ట్రేటు సంప్రతించి, రాజీచేయుటకు ప్రయత్నిస్తున్నారు.

బెంగాల్ లేబర్‌పార్టీ కార్యదర్శి అగు దత్తమజుందారు మూడు నెలల జైలుశిక్ష అనుభవించి మొన్ననే విడుదల అయారు.

## జంషెడ్‌పూరు

రెండు నెలలవరకు జంషెడ్‌పూరు రాకూడదని మణిక్‌హోమీ అను కార్మికనాయకునిపై ప్రభుత్వం 144 వ శెక్షన్ ప్రయోగించింది. తాతా ఉక్కు పరిశ్రమలో కార్మికులకు యజమానులకు కలిగిన తగాదాను గురించి విచారించుట కితడు వచ్చాడు.

## మాంఘీర్

ఇచ్చట పొగాకు ఫ్యాక్టరీలో పనిచేయు 2000 మంది కార్మికులు ఫ్యాక్టరీ లోపలనే ఉండి పనులు మాత్రం మానివేసి సమ్మె చేస్తున్నారు.

## కమ్యూనిస్టు కరపత్రం బోధిస్తున్నారట!

రాజమండ్రి ఆర్థిక రాజకీయ పాఠశాలలో, పోలీసు అధికారి ప్రశ్నలు.

పై పాఠశాల ప్రారంభ దినము నుండియు రాజమండ్రిలో పాఠశాలలో ఏమి జరుగుతుందో తెలిసికోడానికి ప్రత్యేకంగా ఒక సి. ఐ. డి. సర్కిలు ఇనస్పెక్టరు ఇద్దరు షార్టుహాండ్ రిపోర్టర్లు, మరికొందరు స్పెషల్ బ్రాంచి జవాన్లు మహా హడావిడిగా ఉన్నారు. పాఠశాల తరపున ఏర్పరచబడు ప్రతి బహిరంగ సభకు, పాఠశాల ఉద్యోగులు పాల్గొనుచున్న ప్రతి మీటింగుకున్నూ, షార్టుహాండ్ రిపోర్టర్లు, సి. ఐ. డీలు తప్పనిసరిగా హాజరవుతున్నారు. క్లాసులలోనికి వచ్చుటకు పాఠశాల నిర్వాహకు లంగీకరించ నందున లోపలికి మాత్రము వచ్చుటలేదు. కాని ఈ రోజు మధ్యాహ్నం గం. 4—30 ని॥లకు ఏవిధమైన సూచనయు లేకుండగనే సి. ఐ. డి, సర్కిలు ఇనస్పెక్టర్, సబ్ ఇనస్పెక్టరు, ముగ్గురు జవానులు, లోనికి వచ్చి పాఠశాల భవనము ఎప్పుడు ఖాళీ అగుననియు, దీనికేమి అద్దె ఇచ్చుచున్నారనియు, అడిగి బయటకు వెళ్ళి ఆర్గనైజరు గారితో మాట్లాడాలి రమ్మని చెప్పమ్మని ఒక జవానుని లోనికి పంపిరి. ఆయన కారోగ్యము బాగుండలేదు, ఇప్పుడు బయటకు రాలేడు, మీపని నాతో చెప్పండి అని ప్రధాన కార్యదర్శి చెప్పగా మీతో చెప్పుటకు వీలులేదు ఆయనను తప్పక కలిసికోవాలి అన్నారు. ఆర్గనైజరు గారు వచ్చినపిమ్మట స్కూలులో 'కమ్యూనిస్టు కరపత్రము' బోధించుచున్నట్లు మాకు తెలియవచ్చినది. అది ఎంతవరకు నిజములని ప్రశ్నించిరి. మీకు తెలిసిన విషయము సరియైనదికాదు. అదేమీ ఇచ్చట జరగడం లేదు. అని సమాధానమిచ్చిరి. కమ్యూనిస్టు కరపత్రము నిషేధింపబడిన పుస్తకము కనుక అది బోధించరాదని మా సూపరింటెండెంటుగారు మీకు వార్నింగు ఇచ్చి రమ్మని పంపారు. అటువంటిది ఇచ్చట జరుగుచున్నదా లేదా అనే విషయాన్నికూడా పూర్తిగా తెలుసుకు రమ్మన్నారు, కనుక జరుగుచున్న విషయమేదో సరిగా చెప్పండి అని సర్కిల్ ఇనస్పెక్టరు అడుగగా పాఠశాల ప్రధాన కార్యదర్శి మేము కరపత్రాలలోను, పత్రికలలోను ప్రకటించినంతవరకే ఇచ్చట జరుగుచున్నవి. మీకేదైనా విషయం కావాలంటే ఈవిధంగా కాకుండా వ్రాతమూలంగా అడగండి అని చెప్పిరి. అంత అధికారరీత్యాగాను, వ్రాతమూలంగాను అడగాలా ఓరల్‌గా చెప్పరా అంటూ వెళ్లిపోయారు.

నిన్న మధ్యాహ్నం పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ బి. సూర్యనారాయణమూర్తిగారు పాఠశాలను దర్శించిరి. వారు వచ్చుసరికి పాఠములు సాగుచున్నవి. పాఠశాలను గురించి తమ సంతోషమును వెలిబుచ్చిరి.

రాజమండ్రి 24—7—38. — పెన్మెత్స సూర్యనారాయణ. పబ్లిసిటీ సెక్రటరీ.

## బొంబాయి

ఇచ్చట జి. ఐ. పి. రైల్వే పనివారలలో రెండు సంఘములు పనిచేస్తున్నాయి. కార్మికోద్యమంలో చీలిక యుండుట కార్మికులకు నష్టమనియెంచి, రెండు సంఘముల ప్రతినిధులు సమావేశమై, ఒకే సంఘంలో చేరుటకును, దాని పేరు జి. ఐ. పి. రైల్వే పనివారల సంఘం అని రిజిస్టరు చేయించుటకును తీర్మానించుకున్నారు.

# తెనాలి రైసు మిల్లులలో కూలీల దుర్గతి

చట్టం దారి చట్టానిదీ, యజమానుల దారి యజమానులదీ!

శ్రీ తేలప్రోలు వెంకట సుబ్బారావు

### రైసు మిల్లులు

తెనాలిలో 16 రైసు ఫ్యాక్టరీలున్నవి. ఈ 16 ఫ్యాక్టరీలలో సుమారు 5000 మంది మగకూలీలు, 100 మంది ఆడకూలీలు పని చేస్తున్నారు. ఓవర్‌వర్కు, డబుల్‌వర్కు, ఫోర్సుడ్‌వర్కు, తక్కువకూలి, కూలికోతలు, అకారణంగా పనిలోనుంచి తీసెయ్యటం, యింకా యితర నిర్బంధాలు కూలీల వెన్నెముకను విరకొట్టుతున్నాయి.

### ఓవర్ వర్కు వగైరా....

ఇచ్చటి ఫ్యాక్టరీ యజమానులు తెల్లవారుఝామున 4. గంటలనుంచి రాత్రి 8 గంటల వరకు పని చేయిస్తున్నారు. ఫ్యాక్టరీ యజమానుల యీ చర్య ప్రత్యక్షంగా ఫ్యాక్టరీ చట్టపు విరుద్ధం. యీ లెక్కన చూసేట్టయితే యీ ఫ్యాక్టరీ యజమానులు ప్రతి ఒక మగకూలిచేత, ప్రతి ఒక ఆడకూలీచేత 4 గంటలు యెక్కువపని చేయించు కుంటున్నారు. ఫ్యాక్టరీ ఆక్టులో. ఉదహరింప బడిన గంటలకంటె యెక్కువ గంటల పనిని చేయించుకోటం ఓవర్ వర్కు కాదని యెవరు చెప్పగలరు? ఒక ఫ్యాక్టరీలోను ప్రత్యేకంగా డ్రైవరు లేరు. ఫైరుమనే డ్రైవరు పని కూడా చెయ్యాల్సి వస్తున్నది. కొన్ని ఫ్యాక్టరీలలో ఆయిల్ మన్లు కూడా లేరు. ఈ ఫ్యాక్టరీలలో జాబులలో పని చేయు కుఱ్ఱవాళ్ళు చేసే ఆయిల్‌మెన్ చేయాల్సిన పనిని కూడా చేయిస్తున్నారు. ఇది నిస్సందేహంగా డబుల్‌వర్కు. ఈ డబుల్‌వర్కుకుగాని, ఓవర్ వర్కుకుగాని కూలిలేదు. అనగా, యింత పనిని కూలీలు యజమానులకు ఉచితంగా చేసి పెడుతున్నారు. ఇది యిట్లా ఉండగా, ఆయిల్ మన్ల దగ్గర నుంచి రోజు కూలీలవరకు ప్రతి మగ కూలిచేత, ప్రతి ఆడకూలీ చేత యజమానులు వారి యిండ్లవద్ద పాచిపని దగ్గర నుంచి అన్ని పనులు చేయించు కుంటున్నారు. యజమానుల యీ వెట్టిచాకిరికి ముఖ్యంగా గురి అవుతున్నది ఆడ కూలీలు. ఈ చాకిరి చెయ్యకూడదు అని యెవరైనా అనుకుంటే, ఆకూలీ ఆరోజు నుంచి ఫ్యాక్టరీలో పనికి నీళ్లు వదలుకో వల్సిందే. కాబట్టే దీన్ని ఫోర్సుడ్ వర్కు అని అంటారు. ఇన్ని ఒత్తిళ్ళకు లొంగి ఉంటున్నప్పటికి యెప్పుడు యజమాని పని ఊడపీకుతాడో అనే అదురు ప్రతి కూలివాని ముఖమందు స్పష్టంగా కనబడుతుంది.

### తక్కువ కూలి.

తక్కువ కూలి, అందులో కికోతలు కూలీల జీవిత పరిమాణాన్ని తగ్గిస్తున్నాయి. మగ కూలి యొక్క రోజు కూలి 0-4-0, ఆడ కూలీకి రోజు కూలి 0—3—6. ఫ్యాక్టరీ ఆక్టులో ఉదహరింప బడిన గంటలే పని చేయించి నప్పటికి యీ కూలి తక్కువే అని చెప్పాలి. వీరికి యేరోజు కూలి ఆరోజు యివ్వరు. వారాని కొకసారి బట్వాడా యివ్వటం అనే నిర్ణయం ఉంది. కాని ఈ బట్వాడా సరిగా ప్రతి వారం యివ్వరు. ఇది యిట్లా ఉండగా కూలీల కొచ్చే ప్రతి రూపాయలోంచి 0—0—3 కమీషను తీసుకుంటారు. ఈ కమీషను యజమానుల భాషలో 'మామూలు' అని పిలువబడుతున్నది. ఈ మామూలును కొన్ని ఫ్యాక్టరీలలో యజమానులు, మరి కొన్ని ఫ్యాక్టరీలలో గుమాస్తాలు తీసుకుంటున్నారు. అసలే తగ్గిపోతున్న కూలిలోనుంచి యజమానులు అక్రమంగా మామూలు తీసికోటం కూలీలకు చేటటి పోటువంటిది కాదా? తక్కువ కూలి, కికోతలు, బట్వాడా ప్రతివారం సరిగా యివ్వక పోవటమే కూలీలు అప్పులపాలు కావటానికి చాలా వరకు కారణం అవుతున్నాయి. ప్రతి ఆదివారం ఫ్యాక్టరి ఆక్టు ప్రకారం ఫ్యాక్టరీలకు సెలవివ్వాలి. కాని యిచ్చటి ఫ్యాక్టరీ యజమానులు ప్రతి ఆదివారము పని చేయిస్తూనే ఉన్నారు. వారం రోజుల నుంచి పని చెయ్యటం వల్ల చెడిపోయిన యింజను సామానులను బాగు చెయ్యటం యింకా యితర మరమ్మతులను ఆదివారం నాడు చేయిస్తారు. ఫ్యాక్టరీ ఆక్టు ప్రకారం అయితే పది రోజులలో ఒక రోజున మిల్లు కట్టేసి మరమ్మతులు చేయించుకోవాలి. అటువంటి దేమి జరుగడం లేదు. ఆదివారం రోజున మిల్లు కట్టేస్తారు, మిల్లు గేటు వేసుంటుంది, దొడ్డి తలుపు తీసి ఉంచుతారు; మిల్లులో కాటా కూలీలు కాటా వేస్తునే ఉంటారు, ఆయిల్‌మన్లు, ఫైర్‌మన్లు మరమ్మతు చేస్తూనే ఉంటారు. ఇటువంటి సమయములో మిల్లు యిన్‌స్పెక్టరు గాని, యిటువంటి అక్రమాలను చేస్తున్న ఫ్యాక్టరీ యజమానులను బుక్‌చేయు అధికారము గల యే స్థానిక అధికారి గాని ఫ్యాక్టరీ కొచ్చేట్టయితే తీసి ఉంచిన దొడ్డి దారిన, అవసరంగా సెలవు రోజున వారి దౌర్జన్యం వల్లనే పని చేస్తున్న కూలీలను బయటకు కొట్టేస్తారు. ఆదివారం సెలవు రోజయినా మరమ్మతు చెయ్యటానికి యే పనివాడైనా రాకపోతే నాగా వేస్తామంటారు. ఈ విధంగా సెలవు రోజును పనిరోజుగా మార్చేశారు ఫ్యాక్టరీ యజమానులు.

### కాటా కూలీలు

కాటా కూలీలు ప్రతిఫ్యాక్టరీలోను 10, 12 మంది ఉంటారు. వీరికి రోజుకూలి ఉండదు. 100 బస్తాలకు కొంత కూలి అని ఉంటుంది. వీరంతా కలసి రోజుకి యే 4 రూపాయల పనోచేస్తే యిందులో యజమానులు తీసుకునే కమీషన్ పోను మిగతా డబ్బులు అంతా పంచుకుంటే ఒక్కొక్కనికి 0—5—0 లేక 0—5—6 వస్తుంది. ఈ కాటాకూలీలు కూడా ఫ్యాక్టరీ యజమానుల యిండ్ల వద్ద వెట్టిచాకిరి చెయ్యకుండా ఫ్యాక్టరీలో పనిని నిలుపుకోలేరు.

ఫ్యాక్టరీలో ధాన్యం తొట్టికి మోసే వారున్నారు. వీరికికూడా 100 బస్తాలకు యింత కూలిఅని కంట్రాక్టు నిర్ణయిస్తారు. వీరికి కాటా కూలీలమాదిరిగా ప్రతిరోజు కూలియివ్వరు. వీరు వారానికి బట్వాడా తీసుకునే కూలీల లెక్కలోకి వస్తారు. వీరివగ్గర నుంచి కూడా 1-0-0 కి 0-0-3 రూపాయలు మెలేసి లాగుతారు. ఫ్యాక్టరీఆక్టు ప్రకారం పనివాళ్ళకు పనిచేసే టప్పుడు ప్రత్యేక డ్రస్సులు యివ్వాలి, ప్రతిఫ్యాక్టరీలోను పనివాళ్ళు ప్రత్యేక డ్రస్ లేకుండానే పనిచేస్తూ ఉంటారు. "ప్రత్యేక డ్రస్సు లేకుండా పనిచేస్తున్నావేమి" అని అడిగితే "మా యజమాని ఒక నిక్కరు, ఒక బనియన్ కుట్టిస్తాడు. యిన్‌స్పెక్టరు వచ్చినప్పుడు వేసుకోమంటాడు" అని సమాధానం చెబుతాడు. ఇన్‌స్పెక్టరు వచ్చినప్పుడు కూడా పనివాడు ప్రత్యేక డ్రస్సు లేకుండా పనిచేస్తున్నప్పటికి యిన్‌స్పెక్టరు చూసికూడా చూడనట్టు వెళతాడు.

### ఆడ కూలీలు,

ఆడకూలీల కష్టాలు యింత అంత అని చెప్పటానికి వీల్లేదు. వీరు యెంత పనిచేస్తారో వీరికెంత కూలి వస్తుందో చూద్దాం. ఒక గంటకు ఒక హల్లరుమీద 12 బస్తాలబియ్యం తయారవుతై. డ్యూటి మూడుగంటలు. అంటే, ఒక ఆడకూలి ఒక డ్యూటికి ఒకహల్లరుపై తయారైన 36 బస్తాల బియ్యమును మిల్లునుంచి 50 గజాల దూరంలోఉన్న కొట్టుకు మోస్తున్నది. డ్యూటి పూర్తయ్యేటప్పటికి యీ ఆడకూలి ఎన్నిమైళ్ళు నడవాలో చదువరులే గ్రహింతురుగాక. ఇంత కష్టానికి ఓర్చి గాడిదబరువు మోస్తున్న ఆడకూలీకి ఆ డ్యూటికి యిచ్చే కూలి 0-1-9. ఈ ఆడకూలీలను గుమాస్తాల్ను యజమానులు పెట్టే చివాట్లకు అంతు పొంతులేదు.

గర్భిణీ స్త్రీలకు ఫ్యాక్టరీ ఆక్టును అనుసరించి కొన్ని సౌకర్యాలున్నాయి. ఫ్యాక్టరీ యజమానులు ఆక్టులో చెప్పబడిన సౌకర్యాలేమి వారికి కలుగచేయుటలేదు. గర్భభారముదికమై పనిచెయ్యలేక పొయ్యేటంత వరకు ఆగర్భిణీస్త్రీ ఫ్యాక్టరీలో పనిచేస్తూనే ఉంటుంది. ఆతర్వాత కూలి దొరుకుతుంది అనే ఆశ కూడా లేకుండా పనిమానేస్తుంది. ఆడకూలీల స్థితిని గురించి క్లుప్తంగా చెప్పాలంటే, వీరికి పని దొరకటమనేది యజమానులయొక్క గుమాస్తాలయొక్క అభిమానంమీద ఆధారపడి ఉంది అని చెప్పాలి.

ఈ విధంగా ఫ్యాక్టరీ యజమానులు కూలీల కష్టాన్ని మ్రింగేస్తున్నారు. ఇప్పుడిప్పుడే కూలీలలో వర్గచైతన్యం అభివృద్ధపుతున్నది.

### ప్రభుత్వ కర్తవ్యం.

ఈ పరిస్థితులలో ఫ్యాక్టరీ కార్మిక వర్గానికి అనుకూలంగా ఉండునట్లు మదరాసు ప్రభుత్వం ఫ్యాక్టరీ ఆక్టును సవరించాలి.

---

# విద్యార్థిసంఘాలెందుకు

(7 వ పేజీ తరువాయి)

నవుతారు. అప్పటికీ నిర్లక్ష్యంచేస్తే వేరే గతి లేనప్పుడు చివరిదశలో సమ్మెను సాగించి తమ ఆత్మగౌరవాన్ని, ప్రతిష్టనూ నిలబెట్టుకోటానికి ప్రయత్నిస్తారు. అంతేకాని సమ్మె అనే బ్రహ్మాస్త్రాన్ని చీటికి మాటికి వినియోగించి దాని విలువను వ్యర్థపరచ చూడటం విద్యార్థి సంఘాలకు అభిమతం కాదు.

ఉపాధ్యాయులంటే కూడా విద్యార్థులు స్నేహభావంతోనూ, గౌరవభావంతోనూ ప్రవర్తించటమే విద్యార్థి సంఘాలకు అభిమతము. ఉపాధ్యాయులు కూడా విద్యార్థులపై సౌహార్దము, ప్రేమ కలిగి ఉండాలి. అలా ఉండకపోతే వారు విద్యార్థులకు నేర్పేదిదంతా బూడిదలో పోసిన పన్నీరులాగా అవుతుంది. శిష్యుడు అనే భావంతో నిర్లక్ష్యం చూపకూడదు. అలాంటి నిర్లక్ష్య భావంతో విద్యార్థుల యొక్క ఆత్మ గౌరవమునకు, ప్రతిష్ఠకు, విజ్ఞానాభివృద్ధికి అటంకమైన పనులు చేస్తే మాత్రము విద్యార్థి సంఘాలు సహించి యుండజాలవు. పరస్పరమూ సుహృదయమూ, స్నేహభావమూ కల్గి యుండకపోతె చదువుకోటమూ, చదువు చెప్పడమూ కూడా వ్యర్థమే అవుతుంది. అందుకనే పైవాటి కోసం విద్యార్థి సంఘాలు సర్వదా ప్రయత్నించు చుండాలి. ఇంతే కాకుండా విద్యార్థులు చక్కగా చదువుకొనేటట్లున్నూ, దురభ్యాసాలు లేకుండా ఉండేటట్లున్నూ, చక్కని డిసిప్లిన్ కలిగి ఉండేటట్లున్నూ విద్యార్థి సంఘాలు ఏమరపాటు లేకుండా పనిచేస్తాయి. విద్యార్థుల యొక్క సత్ప్రవర్తనయే విద్యార్థి సంఘాలకు ప్రాణభూతము. కాబట్టి పై ఆశయాలను కార్యక్రమాన్ని సోదరులందరూ తెలిసికొని విద్యార్థి ఉద్యమానికి తప్పకుండా చేయూత—నిస్తారని తలుస్తున్నాము.



# మ్యునిసిపాలిటీలలో కాంగ్రెసు వారి కర్తవ్యం

## కొన్ని సూచనలు

శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావు.

ఆంధ్రదేశంలో మొత్తం 29 పురపాలక సంఘాలున్నాయి. వాటి జనసంఖ్య, సభ్యుల స్థానాల సంఖ్య యీక్రింది విధంగా ఉన్నాయి.

| పేరు | జిల్లా | జన సంఖ్య | స్థానాల సంఖ్య. |
|---|---|---|---|
| 1 శ్రీకాకుళం | గంజాం | 16588 | 16 |
| 2 విశాఖపట్టణం | | 57503 | 28 |
| 3 విజయనగరం | | 44696 | 28 |
| 4 అనకాపల్లి | | 23376 | 20 |
| 5 భీమునిపట్టణం | విశాఖపట్టణం | 9629 | 16 |
| 6 కాకినాడ | | 65952 | 32 |
| 7 రాజమహేంద్రవరం | | 63546 | 32 |
| 8 పెద్దాపురము | తూర్పుగోదావరి | 17338 | 16 |
| 9 పాలకొల్లు | | 16906 | 16 (సూపర్‌సీడెడ్) |
| 10 ఏలూరు | పశ్చిమగోదావరి | 57342 | 32 |
| 11 బందరు | | "6928 | 32 |
| 12 గుడివాడ | తూర్పు కృష్ణ | 13585 | |
| 13 బెజవాడ | పశ్చిమ కృష్ణ | 60127 | 32 |
| 14 చీరాల | | 18853 (సూపర్‌సీడెడ్) | |
| 15 గుంటూరు | | 56179 | 32 |
| 16 తెనాలి | | 34580 | 24 |
| 17 ఒంగోలు | | 16672 | 16 |
| 18 నరసరావుపేట | గుంటూరు | 15403 | 16 |
| 19 నెల్లూరు | నెల్లూరు | 45895 | 28 |
| 20 కడప | | 22602 | 20 |
| 21 ప్రొద్దుటూరు | కడప | 20124 | 20 |
| 22 కర్నూలు | | 35314 | 24 |
| 23 నంద్యాల | కర్నూలు | 22608 (సూపర్‌సీడెడ్) | |
| 24 ఆదోని | బళ్ళారి ఆంధ్ర | 35635 | 24 |
| 25 అనంతపురం | | 15099 | 17 |
| 26 హిందూపురం | | 14211 | 16 |
| 27 తాడిపత్రి | అనంతపురం | 12620 | 16 (సూపర్‌సీడెడ్) |
| 28 చిత్తూరు | | 22018 | 20 |
| 29 తిరుపతి | చిత్తూరు | 19138 | 16 |

సూపర్సీడయిన పాలకొల్లు, చీరాల, నంద్యాల, తాడిపత్రి మ్యునిసిపాలిటీలు పోను మిగిలిన ఇరువదైదింటికి ఎన్నికలు జరిగాయి.

బందరు, కడప పురపాలక సంఘాలకు కాంగ్రెసు అసలు పోటీ పెట్టనేలేదు. పోటీచేసి ఆదోని, కర్నూలు, గుడివాడ పురపాలక సంఘాలు కాంగ్రెసు చేతిలోనుంచి ఎగిరిపొయ్యాయి. మిగిలిన 25 మ్యునిసిపాలిటీలలో కాంగ్రెసుది పైచేయి. పురపాలక సంఘాధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నికలలో చిత్తూరు, నెల్లూరు, గుంటూరులలో విద్రోహులగు కాంగ్రెస భ్యర్థుల కపటకృత్యంతో కాంగ్రెసచ్చట పల్టీకొట్టింది. ఇప్పుడు కాంగ్రెసు అధీనం క్రింద ఉన్నాయని చెప్పుకోదగ్గవి 17 తేలుచున్నాయి.

### పురపాలక సంఘాల కార్యక్రమం

పురపాలక సంఘాలలోకి కాంగ్రెసు ప్రవేశించే ముందు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఎన్నిక ప్రణాళికను ప్రకటించాలసింది. గత శాసనసభా ఎన్నికలలోలాగ ప్రణాళికను ఆధారం చేసికొని శాస్త్రీయంగా, సలక్షణంగా ప్రచారం సాగించబడాలసింది. అల్లాంటిదేమీ జరుగక పోవడం ప్రస్తుత కాంగ్రెసు కార్యక్రమ నిర్ణయానికి చాలా ప్రతిబంధకంగా ఉంది. ప్రప్రథమాన ప్రణాళిక గనుక ప్రచురింపబడి యుండి ఎన్నికలు జరిగినట్లయితే పురపాలక సంఘాలలోకి దూరిన ప్రముఖులంతా ప్రత్యేక సూత్రాలకు, కార్యక్రమానికి కట్టుబడి ఉండవలని వచ్చేది, ఎప్పుడైన ఉల్లంఘిస్తే ప్రజాసామాన్యం ఎన్నిక ప్రణాళికను ఆధారం చేసుకొని అల్లాంటి ద్రోహులను సులభంగా తొలగించ ద్వారా శిక్షించ చేసేది. ఇప్పుడు అల్లాంటి దాఖ్యతాయుత పద్ధతికి స్థానం లేదు.

పురపాలక సంఘాలలోకి దూరినవారలందరూ కీర్తిరేని కాంగ్రెసు వాదులు కారు. పక్షాంతరులు, మోసగాండ్రు, జాతీయ విద్రోహులు—ప్రస్తుత కాంగ్రెసు ఉన్నత స్థితిని గమనించి—స్థానిక కాంగ్రెసు సివిక్ బోర్డులలోను, సంఘాలలోను ప్రాముఖ్యత స్థానాలను ఎట్లాగోట్ల సంపాదించుకొని కాంగ్రెసు అభ్యర్థులుగా ప్రత్యక్షమయ్యారు. కాంగ్రెసు యంత్ర సామగ్రి కొంత వారి ఆధీనమైపోయింది. నిష్కల్మష కాంగ్రెసు యువకులంతా కాంగ్రెసు సంస్థ విజయానికి, ప్రతిష్ఠకు కృషి చేయాలసి వచ్చింది. అందేం కాంగ్రెసు ఆంధ్రదేశంలో కొన్ని ముఖ్య ప్రదేశాలలో విజయపీఠి నధిష్టించటానికి అవకాశం కలిగింది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం యిప్పుడైనా—ఎల్లాంటి ఆలస్యం చేయకుండా — మ్యునిసిపాలిటీలలో కాంగ్రెసువారు చేయాలసిన పనులనుగూర్చి 25 ప్రణాళికను తయారుచేసి కాంగ్రెసు మ్యునిసిపల్ సభ్యులంతా దాని ననుసరణ్యంగా నడుచుకొనేటట్లు చూడాలి. అల్లా నడుచుకోని మ్యునిసిపల్ కాంగ్రెసు సభ్యులమీద క్రమశిక్షణ చర్య తీసికొని వారిని కాంగ్రెసు నుండి బయటకు వెడలద్రొయ్యాలి. స్థానిక కాంగ్రెసు సంఘాల సలహామీద ఆయా కాంగ్రెసు మ్యునిసిపల్ పార్టీలు నడుచుకొనేటట్లు చూడాలి.

ప్రస్తుతం కాంగ్రెసు మ్యునిసిపాలిటీలలో ఏ పని చెయ్యాలని ఉంటుందో యీక్రింద పొందుపరుస్తా. ప్రజాసామాన్యాభ్యుదయమే కాంగ్రెసు ఆశయం కాబట్టి, పార్లమెంటరీ రంగానికి దిగటం సామ్రాజ్యవాద యంత్రాన్ని అనువైనచోట ఉపయోగించుకొని, కానిచోట్ల స్తంభీభూతం చేయాలనే కాంగ్రెసు ఉద్దేశం కాబట్టి, మ్యునిసిపల్ కార్యక్రమం కూడా యీ ఫక్కినే అనుసరించాలి.

### కాంగ్రెసు సభ్యులు ఎలా పని చెయ్యాలి.

### సివిల్ జీవితం.

1. ఓటరులకు ప్రజాసంస్థయొక్క, ప్రజా ప్రతినిధిత్వంయొక్క మూలసూత్రాలను ప్రచారంద్వారా ఎరుకపరచడం

2. తమతమ వార్డులలో వారానికి ఒకపర్యాయం తిరగడం. డైరీలలో ఓటర్ల సాధక బాధకాలను ఎక్కించుకొని కౌన్సిలుద్వారా వాటి నివారణకు ప్రయత్నించడం.

3. ప్రతినెల మ్యునిసిపాలిటీలో ప్రజలసొమ్ము ఎలా వినియోగపడుతున్నదో విశదీకరిస్తూ కాంగ్రెసు పక్షాన పక్ష బులెటిన్ ప్రచురించడం; వార్డుసభలను యేర్పాటుచేసి మ్యునిసిపల్ వ్యవహారాలను ప్రజానీకానికి బోధపరచడం.

4. మ్యునిసిపాలిటీల ఆదాయాన్ని ఎల్లాంటి దుబారా ఖర్చు లేకుండ పౌరుల కొరకే వినియోగింపబడేటట్టు చూడడం.

5. నగరముయొక్క ఆరోగ్యాన్ని—డ్రైనేజి స్కీము లేనిచోట ఏర్పాటుచేసి, యింకా యితర శాస్త్రీయ పద్ధతుల ద్వారా—కాపాడడం.

6. వార్డులయొక్క విస్తీర్ణతనుబట్టి, జనాభానుబట్టి మ్యునిసిపల్ పాయిఖానాదొడ్లు విరివిగా ఏర్పాటు చేయడం.

7. నీటి కొళాయీలు అధికంచేసి నీటి ఎద్దడిని తగ్గించడం.

8. వివిధ ప్రదేశాలలో గ్రంథాలయాలు, సుందరమైన ఉద్యాన వనాలు నెలకొల్పడం.

9. పార్కులలో రేడియో యంత్రాలమర్చడం.

10. విద్యుచ్ఛక్తి, నీరు మరి యితర సౌకర్యాలు ప్రజానీకానికి మిక్కిలి అందుబాటులో ఉండేలాగ చూడడం.

### నిరుద్యోగులకు

11. నిరుద్యోగుల సంఖ్యను తీసికొని, చిన్న చిన్న పరిశ్రమలకు గ్రాంటులనిచ్చి వానిద్వారా నిరుద్యోగ సమస్యను సాధ్యమైనంత వరకు పరిష్కరించడం; టెక్నలాజికల్ ఇన్‌స్టిట్యూట్ నేర్పాటుచేసి విద్యాధికులగు నిరుద్యోగులకు వృత్తి విద్యలు నేర్పడం.

### కూలినాలి చేసుకొనే జనానికి

12. చిన్నచిన్న చేతి పరిశ్రమలను కల్పించి, విద్యావిహీనులగు పాటక జనానికి జీవనోపాధి చూపించి, తద్వారా దరిద్ర సమస్యను సాధ్యమైనంతవరకు పరిష్కరించడం.

13. వయోజన విద్యను గఱపటానికి కష్టపడి పగలు పనిచేసే వాండ్రకు రాత్రి పాఠశాలలు, మ్యాజిక్ లాంటరన్ ఉపన్యాసాలను ఏర్పరచడం.

### కార్మికులకు

14. మ్యునిసిపాలిటీలో పనిచేసేవారికి 8 గంటలు మించని పని ఏర్పాటుచేయడం.

15. మ్యునిసిపాలిటీలో నౌకరి చేసేవారికి కనీసపు జీతం నెల 1కి రు 25-0-0 ఉండేలాగ చూడడం.

16. మ్యునిసిపాలిటీ వర్కర్సు యూనియన్లను గుర్తించటం.

17. మ్యునిసిపాలిటీ పక్షాన బిల్డింగ్సు కట్టడానికి కంట్రాక్టు యిచ్చేటప్పుడు ఆ కంట్రాక్టరుని కార్మికులకు యీ క్రింది హక్కులు (కనీసము) ఒసంగేటట్లు చూడటం.

(a) రోజుకు 8 గంటలు మించనిపని

(b) ఆదివారములు, పండుగ దినములు జీతముమీద సెలవు.

(c) స్త్రీలచే ఏవిధమైన బరువు పనులు చేయించకూడదు.

(d) కనీసపు జీతము నెలకు రూ 25-0-0 ఉండాలి.

(e) రోజుకూలీ పై జీతాన్నిబట్టి నిర్ణయించాలి.

18. కార్మికులు నివసించే ప్రదేశాలలో రాత్రి పాఠశాలలు పెట్టడం.

19 రెండెడ్ల బండ్లవాండ్రకు, గుఱ్ఱపు బండ్లవాండ్రకు లైసెన్సుఫీజు సాధ్యమైనంత వరకు తగ్గించడం; వారికి యితర సౌకర్యాలు ఒడగూర్చడం.

20. కార్మికులకు. స్వల్ప వెల అద్దెలమీద ఇండ్లు కట్టించి కార్మిక 'కాలనీ'ల నేర్పాటు చేయడం.

21. మధ్యతరగతులవారికి యిప్పుడుండే నీటి పన్నులు మరి యితర పన్నులభారాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించడం.

### రాజకీయాలు

22. ఎన్నికల సమయాలలో కాంగ్రెసు యొక్క స్వాతంత్ర్య పోరాటానికి సహాయభూతమైన వాతావరణాన్ని సమకూర్చడం.

23. రాజకీయ నాయకులకు ఆహ్వానాలు, ఆతిథ్యాలు ఇవ్వడం.

24. కౌన్సిలులో రాజకీయ తీర్మానాలను ప్రతిపాదించి పౌరుల రాజకీయ మనోనిశ్చయాలను వెల్లడించడం.

25. సామ్రాజ్యవాద ప్రతినిధులకు ఎల్లాంటి ఆహ్వానాలు ఒసగకుండా నిరసనభావం చూపడం.

26. కాంగ్రెసు సభాధ్యక్షుని విజ్ఞప్తుల కనుగుణ్యంగా వివిధ నిధులకు విరాళాలివ్వడం.

(మిగతా 16 వ పేజీలో)

# స్వరక్షణకు సాము చేయాలి!

అబలలు సబలలు కావాలి!!

శ్రీమతి చంద్ర సావిత్రీదేవి.

మనం ప్రతిరోజూ వార్తా పత్రికలలో స్పెయిన్, చైనా యుద్ధాలను గురించి చదువు తుంటాం. పురుషులు వెళ్ళి యుద్ధంలో చనిపో తూంటే స్త్రీలు ఇంటిదగ్గర నిస్సహాయులై ఉం టారు. ఫేసిస్టు సైనికులు దిక్కును చోదు తుంటూ స్త్రీల మీద పిల్లల మీదను చేసే ఘోర కృత్యాలకు అంతులేదు. ప్రపంచ యుద్ధంలో గూడ సైనికులు స్త్రీలను ఎక్కడ కనబడితే అక్కడ మానభంగం చేసేవారు. ఇప్పుడు స్పెయిన్‌లో 12, 13 సంవత్సరాల యువతు లను, పెద్దవాళ్ళను కూడా ఇళ్ళలో తొంగబడి బలాత్కారంగా ఇష్టమొచ్చినట్లు ఫేసిస్టు సైని కులు అవమానాలు చేస్తున్నారు. మొరాకో దేశస్థులైన అరబ్బు సైన్యాలను తమ ప్రక్కన తీవ్రంగా పోరాడేటట్లు చేసుకోటానికి, ఫేసిస్టు ఫ్రాంకో, స్పెయిన్ స్త్రీలను మానభంగం కూడా చేయనిస్తున్నాడు. ఎవరైనా ఒకమ్మాయి ఒప్పు కోపోతే, బలత్కారం చేసి పదిమందీ కలసి నోట్లో గుడ్డలు కుక్కి నిన్ను పొడిచివేస్తామని బెదిరిస్తారు. అప్పటికీ పెనుగులాడితే మాన భంగం చేసి పొడిచి చంపేస్తారు. చైనాలో కూడ జపాను సైనికులు చేసేది అంతే. క్రిందటి వారం నేషనల్ ఫ్రంటులో జపాను సేనలు జరిపే అమానుషపు పనులు తెలియ జేసే బొమ్మలను వేసేరు. కొంతమంది జపాను సైనికులు ఒక స్త్రీ ఇంటికి వెళ్ళి పొయిదగ్గర చలి కాచుకుంటామని చెప్పి, బొరబడి ఆమెను బలత్కారంగా ఒకరి తరువాత మరొకరు మాన భంగం చేసేరు. మరొకచోట తన భార్యను అవమానం చెయ్యొద్దని జపాను సైనికుని బ్రతి మాలగా వానిని చావుదెబ్బలు కొట్టేరు. ఇంకో చోట తన భార్యను అవమానం చేసినందుకు అసమ్మతి తెలుపుచుండగా జపాను సైనికుడు వానిని కత్తితో పొడిచి చంపేడు. అని ఆ పత్రికలో వ్రాసివుంది. ఇవన్నీ విన్న ప్రతి స్త్రీకి రక్తపు మండిపోతుంది.

ఈ దృశ్యాలు మన దేశంలో జరిగిన పంజాబు దురంతాలు, శాసనోల్లంఘనోద్యమాల్ని జ్ఞాపకానికి తెస్తాయి. స్వాతంత్ర్యోద్యమంలో వాళ్లాన్న స్త్రీలు ఎటువంటి ఘోరమైన అవ మానాలకు లోనైనారు: బ్రిటిషు సామ్రాజ్య వాదులు ఐర్లండు, పాలస్తయినులలో చేసి నట్లుగా స్వాతంత్ర్యోద్యమంలో ప్రజలను భయ పెట్టటానికి, సైన్యాలను, స్త్రీలను అవమానం చెయ్యటానికి సైతం వదిలి పెదతారనుటకు సందేహంలేదు. మన దేశంలో స్త్రీల స్థితి పాశ్చాత్య దేశాలలోకన్న హీనంగావుంది. కూలీ స్త్రీలు కొంతవరకు ధయం లేకుండా తిరుగు తారు. రైతుల మధ్యతరగతి స్త్రీలమైన మనం ఎక్కడికైనా వెళ్ళాలన్నా, కావలసిన వస్తు వులేమన్నా కొనుక్కోవాలన్నా, ఎంత అవు సరమైన పనిఉన్నా, ఇంట్లోనుంచి కదల లేము. కారణం ఏమిటి? బయటికి వెళ్ళినట్ల యితే ఎవరైనా ఏమైనా అవమానం చేస్తా రేమోనన్న భయం. దొంగలు, పిచ్చివాళ్ళు మనమీదకు వచ్చినప్పుడు వాళ్ళనుంచి రక్షిం చుకోలేమనే భయం. అందుకనే ప్రతి చిన్న పనికిగూడ పురుషులు ఎవరో ఒకరు సాయంగా ఉండాలి. ఈవిధంగా కూలీ స్త్రీలన్న అబల స్థితిలో ఉండడానికి కారణం, వారిలాగ మన వాళ్ళు పనిచెయ్యకుండా ఇంట్లో కూర్చొని బల హీనులు గావటమే.

ఈ దుస్థితిలో ఇంకా మనం ఎంతకాలం ఉండాలి? మన అబలత్వాన్ని పోగొట్టుకొని సబలలు గావాలి. మనం ఏమీ చెయ్యలేమని ఇంట్లో కూర్చున్నా నష్టం అంతే. మనకూ పురు షులకున్న కాళ్లు చేతులున్నాయి. తెలివి ఉంది. దానిని ఏవిధంగా ఉపయోగించుకోవాలో తెలుసు కోవాలి. స్వరక్షణ ఉపాయాలు నేర్చుకోవాలి. కర్రసాము, బాక్సింగు ఇంకా ఇలాంటివే చిన్న చిన్న ఉపాయాలు నేర్చుకోవాలి. ఎగతాళి చేస్తారని జంకుకోగూడదు. వాళ్ళకు స్వరక్షణా వశ్యకతను తెలియ జెప్పాలి. ఉత్తర హిందూ స్థానంలో అక్కడక్కడ స్త్రీలు కర్రసాము మొదలైనవి నేర్చుకుంటున్నారు. స్త్రీ సంఘాలు వెంటనే తమ కార్యక్రమంలో స్వరక్షణ నేర్పటం గూడ ముఖ్యంగా చేర్చుకొని పని ప్రారంభిం చాలి.

పురుషుల కొక మనవి. ప్రపంచంలో జరిగే ఘటనలను గమనించాలి. తమ భార్యలను స్వరక్షణోపాయాలు నేర్చుకొనటానికి ప్రోత్స హించాలి. స్త్రీలు స్వరక్షణోపాయలు నేర్చు కుంటే పురుషులకు చాల ప్రయాస తప్పుతుం దని గ్రహించాలి.

# మ్యునిసిపాలిటీలలో కాంగ్రెసు

(15 వ పేజీ తరువాయి)

విద్యార్థులకు

27. నిర్బంధ ప్రాథమిక విద్యను అమలు పరుచుటం.

28. మ్యునిసిపల్ పాఠశాలలకు సంబం ధించిన విద్యార్థుల యూనియనులను ఒప్పుకొనుటం.

29. పాఠశాలలో హిందీ నేర్పటం. వృత్తి విద్యలు గఱపటం. జాతీయ ప్రబోధం చేయటం. "మే" డే, సంపూర్ణ స్వాతంత్ర్య దినం, జలి యన్‌వాలా బాగు దినము మున్నగు జాతీయ దినాలలో విద్యార్థులు ఎల్లాంటి ఆటంకం లేకుండా పాల్గొనేటట్లు చూడటం.

30. విద్యార్థుల సక్రమ కోర్కెలు నెర వేర్చటం.

ఇతర విషయాలు

31. వ్యాయామ శాలలకు, హరిజన వసతి గృహాలకు గ్రంధాలయాలకు మరి యితర ప్రజాసేవ నొనర్చే సంస్థలకు గ్రాంటునిచ్చి ప్రోత్సహించటం.

32. సంవత్సరాని కొకసారైనా అఖిల భారత ఖాదీ స్వదేశ వస్తు ప్రదర్శనాన్ని జర పటం.

33. మ్యునిసిపల్ మ్యూజియంను ఏర్పాటు చేయటం.

పై కార్యక్రమం అవలంబిస్తే కాంగ్రెసు శక్తి హెచ్చుతుంది. కార్మికులు, విద్యార్థులు, మధ్య తరగతి నిరుద్యోగులు యీ సైన్యమంతా కాంగ్రెసు వెనకాల ఉంటారు. సంపూర్ణ స్వాతంత్రం కొరకు ముందువచ్చే బ్రహ్మాండ మైన సమరంలో ప్రజానీకం అంతా, కాంగ్రెసు చరిత్రను సింహావలోకనం చేసుకొని అగ్ని గుండంలోకి దిగుతుంది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు ప్రజా పోరాటానికి ప్రాధాన్యత యిచ్చి, కాంగ్రెసు పార్లమెంటరీ రంగంలో విప్లవ శక్తి పాత్రను నిర్వహించుకోవాలని ఉద్దేశముంటే పై కార్య క్రమాన్ని యివ్వవలసి ఉంటుంది.

# ఒక అరకప్పు కాఫీ

ఒక్క ఉదయాన్నే కాదు - మీరు అలసిపోయి నపుడల్లా 'ఓ అరకప్పు కాఫీ' అంటూ తహతహ లాడతారు. కాని మీకు సంతృప్తినిచ్చే కాఫీ దొరక నపుడు విచారపడతారు.

మా ప్రశస్తమైన కాఫీపొడిని ఉప యోగించి చేసిన కాఫీ త్రాగితే, అల సటా పోతుంది. హుషారునూ ఇస్తుంది.

కే. యస్. పతి అండ్ కో.,

గాంధినగర్, బెజవాడ.

# మంచి హోటలు కోసం

ఎక్కడండీ, ఎక్కడ అంటూ వెదుకుతూ ఉంటారు. స్నాన పాన సౌకర్యాలూ - శుచీ, రుచీ, ఉన్న భోజన పదార్థాలూ, కావాలంటే మా ఆంధ్ర భారతీ భవనం (అరండేల్ సత్రం వద్ద, హిందూస్థాన్ బ్యాంకికి ఎదుట) కు, ఒక సారి విచ్చేయండి. మీకే బోధపడుతుంది.

యల్. వి. యస్. రావు,

ప్రొప్రయిటరు,

ఆంధ్ర భారతీ భవనం,

గవర్నరుపేట, బెజవాడ.

# రైతులకు - కూలీలకు మధ్య సామరస్యమెట్లు?

(5 వ పేజీ తరువాయి)

జాగ్రత్తగా నడుపుచూ వారివారికిగల తగాదాలను రాజీపరుచుచుండిన చాలా అభివృద్ధి చెందగలదు. యీ విషయం నిద్యనము చూడవలెనన్న ఒక పిర్కాయందు సోషలిస్టు వర్కరులు స్థానిక ముగా వుండి పనిచేసిన, అనుభవంచే తెలియ గలదు. అచోట కూలీలకు రైతులకు తగాదాలు రాజాలవు. కూలీలకు సరియైన కూలియిచ్చి వారి కోర్కెలు కోర్కెలు రైతులు తీర్చి జాతీయ సంఘటనయందు ఉభయులు తప్పక పాల్గొన గలరు.

వ్యవసాయ కూలి సంఘాలకు రైతు సం ఘాలకు మధ్య యెలాటి సంబంధ ముండాలి అనే ప్రశ్నకు సమాధానమిది.

ప్రత్యేక ప్రత్యేక సంఘాలు మాత్రముండ వలెను. అసలు ఉభయ సంఘాలకు విరోధ భావములు కలుగకుండానే స్థానిక వర్కరులు జాగ్రత్తగా రైతుల సహకారం, కూలీలకు బోధించుచూ, కూలీ బలమును రైతులకు తెలు పుచూ సంఘమును జాతీయ సంఘటనము వైపుకు త్రిప్పిన మనము గమ్యస్థానం చేర గలము. అంతేగాని, యిప్పటిమాదిరిగా సంవ త్సరమునకు యే ఒక పర్యాయమో వర్కరు, గ్రామీణులకు వచ్చి యే మాలపల్లియందో ఒక ఉపన్యాసముచేసి వెళ్ళిన, తరువాత జరుగు చిత్ర విచిత్రమైన యిబ్బందులకు మితియుం డదు. యిటీవల యీ ప్రాంతమందు జరిగిన వ్యవసాయ కూలి సమ్మె సఫలముగాకపోవు టకు నాకు తోచిన సంగతులు తెలుపుదును.

సమ్మెజరిగిన గ్రామమున రైతుసంఘంగలదు, కూలీ సంఘం గలదు. యీ రెండు సంఘ ములు స్థాపించినది ఒక సోషలిస్టు మిత్రుడు. అయితే ఆయనకు అంతగా అనుభవము లేక పోవుటవల్ల ఉభయులకు సంఘములయొక్క ప్రాబల్యం నచ్చజెప్పజాలక పోయినాడు. సమ్మె ప్రారంభించినది వరికోతల సమయములో. ముం దుగా కూలీలయందు ప్రబోధము చేయలేదు. వారిచేత గావలసిన అధికకూలి రైతు సంఘ మునకు తెలుపలేదు. రైతు సంఘమునకు తెలి యజేసిన వారు తప్పక కోరిన కూలికి సమ్మ తించెడి వారే. ఆవిధముగా చేయక వీరు కోత కోయుచుండగా ఒక రైతు చేనువద్దకు వెళ్ళి ఆరైతు పొలమునుంచి కోతకోయు కూలీలను, త్రిప్పుకొని వచ్చినాడు. ఆవిధముగా చేయుటచే ఆరైతులకు యీర్ష్య జనించినది. తగిన ప్రబోధము లేనందున సమ్మె భగ్నమయినది. ఆ నాయకుడు యిటు రైతులకు అటు కూలీ లకు నమ్మకము చెడవలసి వచ్చినది. ఆగ్రామ మున రైతులు సంఘమును (ఈయనే స్థాపించి నందు వల్ల) తీసివేసుకున్నారు. అమాయపు రైతులు సోషలిస్టు విధానమునే నిందింపసాగిరి. దీనికి సహకారముగా ఛోటా కాంగ్రెసు నాయ కులు తిట్టుటకు మద్దతు యిచ్చిరి. యీలాంటి పరిస్థితులు స్థానిక వర్కరుల లోపముచే వచ్చుచున్నవి. గాన "నవశక్తి" యందు సూచించిన ప్రకారం, వేరు వేరు సంఘములు స్థాపించుచూ రాజీ బోర్డులకు తీర్పులకు సలహా యిచ్చుటకు, యితర నాయకులను కోఆప్టు అధికారం కూడా యివ్వవలెను. యెందుకనగా ఒక్కొక్క గ్రామ రైతులకు ఒక్కొక్క నాయకుని యందు మంచి అభిప్రాయం గలదు. కాన వారిసూచన అనుసరించి నాయకులను తీసుకనివచ్చి రాజీ కుదుర్చుట ప్రథమ కర్త వ్యము.

# విప్లవం కావాలి — విప్లవం తేవాలి.

దేశ ఔన్నత్యం పెంపొందాలన్నా దేహారోగ్యంతో తులతూగాలన్నా
విప్లవం తేవాలి — విప్లవం రావాలి
దేహంలో ఉష్ణరక్తాన్ని ఉరికించి విప్లవ శక్తుల్ని కల్పించి తల్పవిప్లవం
— తెచ్చిననాడు —
దేహారోగ్యానికి లోటుంటుందా — జీవితోత్సాహానికి హద్దుంటుందా —
తత్వాన్ని తాదుమాదుతేసి అమిత బలాన్ని సృష్టించడంలో
స్వామీస్ — 'అమృతప్రాశ్'.
అద్వితీయమైన రసాయనం.
అశ్వినీకుమార్ ఫార్మసీ — నర్సాపురం



# వార్తలు - లేఖలు

## డిసిప్లినరీ చర్యలకసమ్మతి

అల్లూరి సత్యనారాయణ ప్రభృతులపై డిసి ప్లినరీ చర్య తీసికొన్నందులకు అసమ్మతి చూపిన మరికొన్ని సంఘాలు.

(1) గుడివాడ పట్టణ యువజన సంఘ కార్యవర్గ సమావేశం. (10-7-38)

(2) నాగాయితిప్ప గ్రామయువజన సంఘం (5—7—38)

(3) కొణకంచి గ్రామ కాంగ్రెసు సంఘం (14—7—38)

(4) తుమ్మపూడి గ్రామరైతు సంఘం (7—7—38)

## సభ్యత్వం రద్దు

వాశిరెడ్డి నారాయణరావు, రేపాల బుచ్చి రామయ్యగారల సభ్యత్వము ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంవారి చర్యకు అసమ్మతి తెలు పుచూ తుమ్మపూడి గ్రామ రైతు సంఘం 6—7—38 వ తేదీన తీర్మానించినది:

## యువజన సంఘాలు

10—7—38 వ తేదీన గుడివాడ పట్టణ యువజనసంఘ కార్యవర్గము శెట్టిపల్లి వెంకట రత్నంగారి అధ్యక్షత క్రింద సమావేశమైనది.

తీర్మానములు

(1) ద్వితీయ వార్షికోత్సవం ఆగస్టులో జరుపుటకు. అధ్యక్షులుగా జె. రామలింగయ్య గారిని, ప్రారంభకులుగా సి. రాజేశ్వరరావు గారిని, పతాకోత్సవానికి వల్లభనేని సీతామహ లక్ష్మమ్మగారిని ఆహ్వానించుటకు తీర్మానించిరి.

(2) ఇంతవరకు కాంగ్రెసు మంత్రులు గావించిన ప్రజాహిత కార్యాలకు సంతసిం చుతూ, కొత్తపట్నంపై నిషేధం తొలగించా లని, నిర్బంధచట్టాల నుపసంహరించు కోవా లని, రాజకీయ గ్రంధాలపై నిషేధం తొలగిం చాలని, మరొక తీర్మానం గావించారు.

విడదవోలు

నిదదవోలు యువజన సంఘ అత్యవసర సమావేశం 11-7-38న డాక్టర్ అజ్జరపు సూర్య నాగేశ్వరరావుగారి ఆధిపత్యాన సమావేశమై ఫెడరేషను విషయమై సుభాషుబోసుగారి ప్రకటనపై సత్యమూర్తిగారి విమర్శను ఖండిం చుచూ సుభాష్‌బోసుగారిని సమర్థించుచూ తీర్మానము గావించిరి. రాజీపద్ధతులకు కొందరు నాయకులు దిగకుండా ఆందోళన చేయవలెనని మరొక తీర్మానం గావించారు.

## గ్రామ కాంగ్రెస్ సంఘం

(కొణకంచి)

13—7—38 వ తేదీ సమావేశమైన కాంగ్రెసు సంఘములో గావించిన తీర్మాన ములు.

(1) గ్రామంలోని వేరుశనగ వ్యాపా రస్తులు గ్రామ కాంగ్రెసు సంఘానికి పుట్టి ఒకటికి 0-0-3 చొప్పున ధర్మమీయ వాగ్దాన ములు చేసినందులకు అభివందనాలు.

(2) మునగాల జమీందారులు గావించు దౌర్జ న్య కృత్యములను ఖండించుచూ, రైతుల ఇబ్బందులను విచారించుటకు ప్రభుత్వము పూను కొనవలెనని కోరుట.

(3) రేపాల బుచ్చి రామశేషయ్యగారిని (ఏ. ఐ. సి. మెంబరు. జిల్లా కాంగ్రెసు సహా య కార్యదర్శి) మొదలైన వారి బహిరంగంగా ఖండించగును.

కొట్టిన, బొమ్మి శీతారామయ్యగారిపై డిసిప్లినరీ యాక్షను తీసుకొమ్మని రాష్ట్రసంఘం వారిని కోరుట.

## యావదాంధ్ర యాత్ర

ఇదివరకు ప్రకటించినట్టుగాక జులై 18 బదులు, ఆగస్టు 1 వ తేదీనుండి, యావదాంధ్ర యాత్ర సల్పెదనని వావిలాల గోపాలకృష్ణయ్య గారు తెల్పుచున్నారు.

## ఆంధ్ర మహాసభ

20 వ ఆంధ్ర మహాసభ చెన్నపురి గోఖ్లే హాలులో ఆగస్టు 13 వ తేదీన జరుగును. మహాసభ జరుపుటకు సన్మాన సంఘం ఏర్ప డింది.

తాత్కాలిక సన్మాన సంఘానికి, గద్దెరం గయ్య నాయుడుగారు, ప్రధాన కార్యదర్శిగను, తట్టా వెంకట రాఘవాచారి, పి. వి. రాజ మన్నారు. కె. శ్రీరాములు నాయుడుగార్లు సంయుక్త కార్యదర్శులుగను, బచ్చు జగన్నాధ దాసుగారు కోశాధికారిగను ఏర్పడ్డారు. సన్మాన సంఘ కార్యాలయం 17, గిడ్డంగి వీధిలో ఉంటుంది.

## సత్తెనపల్లి సభలు

సత్తెనపల్లి తాలూకా మహాసభలు జులై 31 వ తేదీన జరుగుతాయి. సభా ప్రారంభకులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, అధ్యక్షులు కల్లూరి చంద్రమౌళిగారు.

రైతులు, కూలీలు విరివిగా వచ్చి సభ జయప్రదం గావించాలని ఆహ్వాన సంఘ కార్య దర్శి అనుముల రామిరెడ్డిగారు వ్రాయు చున్నారు.

## విజ్ఞప్తి

నెల్లూరు జిల్లాలోని కాం॥ సో॥పార్టీ సభ్యులకు—

కామ్రేడ్స్

సోనేపూరిలో సమావేశమైన ఆల్ ఇండియా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక వర్గ మువారు ప్యాసివుసభ్యులకు వోటుహక్కుగూడ వుండకూడదని తీర్మానించినారు. ఇదివరకు పైకమిటీలకు కార్యనిర్వాహక వర్గ ములకు ఎన్నుకొనబడు హక్కు లేదు. మనజిల్లాలోని పార్టీసభ్యులలో యాక్టివుసభ్యుల వద్దనుండికూడ వర్కురిపోర్టులు వచ్చుటలేదు. రిపోర్టులు పంపనివారుకూడ పనిచేయుచున్నట్లు తెలియు చున్నది. వచ్చేకార్యనిర్వాహక సమావేశము లోపలవర్కురిపోర్టులు పంపనివారు పనిచేయు చున్ననుసరే ప్యాసివుసభ్యులలిస్టులోకి చేర్చ బడుదురు. కార్యనిర్వాహక సభ్యులుకూడ పంప లేదు. కాబట్టి వారిని ప్యాసివులిస్టులోకి చేర్చినకార్యనిర్వాహకసభ్యత్వము రద్దుఅగును. యింకా కొంతమంది చందాలు పంపలేదుగాన వచ్చేసమావేశములో వారి సభ్యత్వముకూడ

## చేయవలసినపని.

ప్రతిసభ్యుడును తాను యిదివరకుపనిచేయు చున్న ప్రాంతములలో కాంగ్రెసులో మెంబర్లను చేర్పవలయును. బెజవాడలో జరిగిన పార్టీ మీటింగులో కాంగ్రెసుసభ్యులను చేర్చునప్పుడు ప్రచారము చేయవలసిన కార్యక్రమము 6-7-38 తేదిన నవశక్తిలో యిచ్చిరిగాన ప్రచారం చేయు చు రైతులున్న స్థలములందు (1) లంచగొండి తనము (పి.డబ్ల్యు డిపార్టుమెంటు గ్రామకరణ ములు) (2) 250 రూపాయలలోపల శిస్తుకట్టు వారికి ఈసంవత్సరమే సగము శిస్తు తగ్గించ వలెను (జమీందారిప్రాంతమైన రైతువారి ప్రదే శముతో పాటు సౌకర్యములయేర్పరుచుట) (3) పుల్లరి రేటుతగ్గించినట్టే కల్లాకుకూడ సగము తగ్గించుట.

వ్యవసాయకూలీలున్న స్థలములందు,

(1) పిచ్చుముంతలు పోగొట్టుట (2) నాము పద్ధతి రద్దుచేయుట. (నూటికి సం॥రము 18 రు 25-0-0 లు మొదలు రు. 50-0-0-ల వడ్డీ) (3) పెట్టిచాకిరి, ఇవిగాక ప్రతిగ్రామమునకు (1) పంచాయితీ బోర్డులు (2) బాటసౌకర్య ములు (3) వైద్యసౌకర్యములు (4) స్కూళ్లు (5) బావులు మొదలైనసౌకర్యములు వెంటనే ఏర్పరచవలయునని ప్రచారముచేయుచు మెంబ ర్లను చేర్పించి ప్రతి 15రోజులకు ఏగ్రామములో ఎంతమందిని చేర్పించినది పార్టీ ఆఫీసుకు తెలి యజేయవలయును. మెంబర్లు చేర్పించు గడవు సెప్టెంబరుకు ఆఖరు. కావున ఆగష్టు లోపలనే స్థానికముగా మెంబర్లను చేర్చుటపూర్తిచేసిన సెప్టెంబరంతయు జిల్లాలో యెచ్చట మెంబర్లు చేరలేదో అచ్చటికివెళ్లి చేర్పించవలెను.

బి. శంకరయ్య.

నెల్లూరుజిల్లా కాం॥సో॥ పార్టీ కార్యదర్శి.

## జమాఖర్చులు

తునితాలూకా రైతు సభ.

| | | | |
|---|---|---|---|
| విరాళములు | రు. 125 | 120 | 0 |
| ప్రచురణ | రు 20 | 20 | 0 |
| స్టేషనరీ | 5 | 0 | 0 |
| తపాలా ఖర్చులు | 5 | 0 | 0 |
| ప్రయాణపు ఖర్చులు | 30 | 30 | 0 |
| భోజనము ఫలహారము వగైరా | 65 | 60 | 0 |
| | 125 | 120 | 0 |
| బియ్యం బస్తాలు వసూళ్ళు | 3 | 3 | |
| | 2 | ఖర్చు | |
| | 1 | 1 | |

ఇనుగంటి నారాయణరావు.

ది 17-7-1938

## హిందీ పండితులదుస్థితి

ప్రధాన మంత్రిగారైన సి. రాజగోపాలా చార్యులుగారు "శాస్త్రీయమైన హిందీని ముఖ్య భాషగా చేయుటకు సాధ్యమైనంత త్వరలో కోర్కె

ప్రయత్నించెదను" అని సెలవిచ్చారు. హిందీ ప్రచారక సంఘం "మద్రాసు రాష్ట్రములో 1000 స్కూళ్లున్నవి. హిందీ ప్రచారకులు, విశార దులు అప్లికేషనులు పంపుకొనుడు" అని మొదట ప్రకటించింది. కాని ఈమధ్య మరి యొక ప్రకటన గావించింది, 125 స్కూళ్ళ లోకి 125 మందిని మాత్రమే తీసుకుందురని, వారుకూడ స్కూలుఫైనలు ప్యాసయి యుం డాలని. ఇంగ్లీషురాని హిందీ పండితులు పనికి రాదంటే 5, 6 సంవత్సరాలుగా జిల్లాబోర్డు తది తర సంస్థలో ఉన్న ఇంగ్లీషురాదని హిందీ టీచర్లపై నెక్షనురీత్యా అధోగతిపాలు కావల సినదేనా? ఏమో ఎవరికి తెలుసు. విద్యామం త్రికి, ప్రచారకసమితికి విన్నప మేమనగా, చాలకాలమునుండి హిందీ భాషాసేవయే ముఖ్య మని తలంచుచు ప్రచారములోనే బహుశ్రమ ప్రయాసలకోర్చిన హిందీపండితులపై కాఠి న్యమువహించక వారిని అభివృద్ధిలోకి తీసుక రాగలందులకు మిక్కిలి కోరుచున్నాము.

హిందీభాషాభిమాని

ఐ. బుచ్చిరాజు, సింగరంపాలెం.

స్వీకారము

## ప్రభాతం

వారపత్రిక:— సంపాదకులు న్యాపతి నారా యణమూర్తిగారు. 12 పేజీలు: అణా. సంవ త్సర చందా మూడు రూపాయలు. అడ్రస్, 33 జోన్సు వీధి, జార్జిటౌన్, మద్రాసు.

★

స్వాతంత్ర్య ప్రభాతానికి పరితపించే ఈ రోజుల్లో, స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకు సాగించేం దుకు మరొక జాతీయ వారపత్రిక రావడం శుభం.

సంపాదకులు అనుభవజ్ఞులు; పలు కష్టము లనుభవించిన త్యాగమూర్తి. ఇక ఈ "ప్రభా తం"ను సమర్థతో నడుపుతారంటానికి సందేహం దేనికి?

జాతీయ, అంతర్జాతీయ విషయాలను, రాష్ట్రీయ సమస్యలను, ఆయా శీర్షికల క్రింద చక్కగా అమర్చిన వ్యాసాలున్నాయి.

వ్యంగ చిత్రాలు కూడ పత్రికకు అలంకారం తెచ్చాయి.

పత్రికకు, రంగా, గొట్టిపాటి బ్రహ్మయ్య గూడవల్లి రామబ్రహ్మం, కాశేశ్వరరావు, పళ్ళంరాజు, బాపినీడుగార్లు సందేశాలు పంపారు.

కాని ఒక సందేహము మాత్రము బాధించు చున్నది.

"పౌరస్వేచ్ఛ అంటే యేమిటి?" అనే వ్యాసం హరిజన పత్రికలో చాల మాసముల క్రింద ప్రకటించబడినది. దానిని వ్యంగ్యముతో కూడిన భాషలో కృష్ణా పత్రిక "ఆనంద దాస" గారు అనువదించారు (25-12-37). ఆ యను వాదాన్నే యథాతథంగా ఇపుడు ప్రకటించలిసిన అవసరం ప్రభాతానికేమున్నది? పోనీ అవ సరమే వచ్చినా, కృష్ణాపత్రిక తమ్యూనిస్టులపై దాడిసల్పుటకు వ్యంగభాషలో అనువదించిన అనువాదమే కావలసి వచ్చినదా?

పౌరస్వత్వ హక్కులను విస్తృతపరచటానికి కాంగ్రెసు మంత్రివర్గానికి చేయూత. ఉత్తిదివిస్తూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సంయుక్త సంఘటనకై 'ప్రభాతం' తోడ్పడాలని మా కోర్కె.

## "స్వరాజ్యము నా జన్మహక్కు" అను స్వాతంత్ర్య నినాదము ప్రసాదించిన

# లోకమాన్య తిలక్

శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య

లోకమాన్య బాలగంగాధర తిలక్ చని పోయి యీ ఆగష్టు 1వ తేదీకి 18 యేళ్ళవు తుంది. కాని యింకా నేము ఆయనను మరచి పోలేదంటే ఆయన కొన్ని గొప్ప సిద్ధాంతాలకు జీవితాంతం వరకు నిలబడి చివరకు వాటి కోసం ప్రాణార్పణం చేయడమే కారణం.

### త్యాగం

బి. యె. ప్యాసయినాడు. యల్. యల్. బి. కూడా ప్యాసయినాడు. గణితశాస్త్రంలో అఖండుడు. సంస్కృతంలో అసమాన పండితుడు. తర్కశాస్త్ర ప్రవీణుడు. పాండిత్యానికి తోడు సునిశిత బుద్ధి ప్రభావం కలవాడు. అయినా యితర విద్యాధికుల వలె ధనార్జన కోసం విద్యను వినియోగించక చిన్నతనంలోనే యావజ్జీవ దేశసేవా దీక్షను స్వీకరించి చివర వరకు చెక్కుచెదరక నిల్చి సేవా వ్రతమునందే అసువులు బాసిన అనఘ చరితుడు.

### ఒక ప్రశ్న

ఏదైన ఒక మహోద్యమం బయలుదేరి నప్పుడు ఆ ఉద్రేకంలో అనేకమంది అగ్ని హోత్రంలో సైతం దుముకడానికి సిద్ధమౌతారు. కాని వేడి చల్లారగానే నిరుత్సాహులై వెనుకకు మరలుతారు. మరలని వారు కూడా కొందరు కొంత కాలానికి తమ త్యాగానికి "ఫలమును" ఆశిస్తారు. కాని యే దశలోను త్యాగానికి ఫలాన్ని కోరని తిలకువంటి వారు బహు అరుదు. ఒక్కసారి ఆయనను చిత్రమైన ఒకటి ప్రశ్న అడిగారు.

ప్రశ్న:— లోకమాన్యా! ఇండియాకు స్వరాజ్యం వచ్చిన తర్వాత నీవు రిపబ్లిక్కుకు ప్రెసిడెంటువై యెన్నివందల జీతాన్ని పుచ్చుకుంటావు?

జవాబు:— నెలకు రు. 30 లు జీతం తీసికొని లెక్కల మాష్టరు నవుతాను. ఆరు సంవత్సరాల దీర్ఘ కారాగార వాసం మాండలే జైలులో అనుభవించిన తర్వాత చెప్పిన అమూల్య వాక్యములివి.

### మరో ప్రశ్న.

ప్రశ్న:— సంతత స్వరాజ్య ప్రయత్నమే కాని నీవు డబ్బు సంపాదించ లేదే: నీవు పోయిన పిమ్మట నీ దహన సంస్కారానికైనా కొంత పైకం వుంచవద్దా?

జవాబు:— అది నా పని కాదు. శవాన్ని దహనం చేయకపోతే పురుగులు పట్టి వ్యాధి వ్యాపించును కాన అది యితరుల పని.

### కాంగ్రెస్ కిరీటం.

కాంగ్రెసు కిరీటాన్ని యీయన ధరించలేదు. దాన్ని నిరాకరించిన యేక భారతీయుడు. 1918 వ సం॥ డిశెంబరులో ఢిల్లీలో జరిగిన దేశీయ మహాజనసభకు ఏకగ్రీవంగా తిలకును అధ్యక్షునిగా యెన్నుకొన్నారు. కాని ఆయన దానిని నిరాకరించాడు.

### తిలక్—గాంధీ సంఘర్షణ.

జరోపా మహాసంగ్రామ సమయంలో స్వరాజ్య ప్రయత్నము మరువకుగా సాగించాలని అన్నాడు తిలకు. బ్రిటీషువారిని ఆపత్కాలంలో చికాకుపరచ (Embarass) కూడదని అన్నాడు గాంధి. పైగా వారికి సహాయం చేయమన్నాడు. తాను వారికి స్వయంగా సహాయం చేశాడు.

అప్పట్లో బొంబాయి గవర్నరయిన విల్లింగ్డను ప్రభువు బొంబాయిలో యుద్ధ సహాయ సభను పిలిపించాడు. బ్రిటీషువారికి సహాయం చేయమని కోరేడు. భారత రాజకీయవేత్తలు ఒకరివెనుక ఒకరు రాజభక్తిని ప్రకటిస్తూ భారతీయులంతా సహాయం చేయాలని గంభీరోపన్యాసాలిచ్చారు.

### మా స్వరాజ్యంమాట ఏమిటి?

తిలకు లేచి "మీకిప్పుడు ఆపత్కాలమయితే (యుద్ధంవల్ల) మాకు నిత్యము (స్వరాజ్యము లేకపోవడం వల్ల) ఆపత్కాలమే. మీకు సహాయ మర్థిస్తున్నారు. మా స్వరాజ్యంమాట యేమిటి?" అన్నాడు. ఉగ్రుడైనాడు సామ్రాజ్యవాది విల్లింగ్డను. నిర్లక్ష్యంగా వెళ్ళిపోయేడు సభనుండి. ఎదురివారంగా భారతదేశ నాయకుడు తిలకు.

"యుద్ధం వస్తోంది వస్తే మేం మీకు సహాయం చేయం. స్వరాజ్య పోరాటం మరింత తీవ్రతరం చేస్తాం". అని యిప్పుడు ప్రతిపిల్లవాడు గర్జిస్తున్నాడు. అప్పుడు గర్జించింది తిలకు సింహమొక్కడే.

### "సత్యం; అహింస".

అమృతసరులో వచ్చింది ప్రత్యక్షంగా గాంధీ-తిలకు సంఘర్షణ. పంజాబుహత్యలను గూర్చిన తీర్మానంమీద.

"ప్రజలు పోలీసులపై రాళ్ళు రువ్వినారు. దౌర్జన్యం చేసినారు. ఆచర్యలను కూడ నిరశిస్తున్నా"మని కూడా చేర్చాడు మహాత్ముడు. ఆమాటలు తీసివేయాలంటాడు లోకమాన్యుడు. "సత్యం అహింసా" సూత్రాలకు ఆమాటలు తీసివేయడం భంగమంటాడు మహాత్ముడు. మరేమీ ఫరవాలేదంటాడు లోకమాన్యుడు. ఉద్రేకంతో "ఇదా గీతాభాష్యకారుడు చెప్పే మాటలు, ఆశ్చర్యము! ఆశ్చర్యము!!" అని ముక్కుపై వ్రేలిడుకొన్నాడు గాంధి.

"గీతా భాష్యకారుణ్ణి కనుకనే చెప్పేను" అని అన్నాడు తిలకు ఆవేశంతో. కొంతకాలం పత్రికలలో కూడ సాగింది వాదోపవాదాలు వీరి ఇద్దరిమధ్య అహింసా నిర్వచనం గూర్చి.

అనాడు "బ్రిటీషు న్యాయం"లో అఖండ విశ్వాసి గాంధి. బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి ప్రక్కలో బల్లెము తిలకు.

"స్వరాజ్యము నాజన్మహక్కు. అది వరుల దయాధర్మ భిక్షంమీద ఆధారపడి యుండలేదు. దానిని నేను సంపాదిస్తాను" అని భారత స్వాతంత్ర్య పోరాటానికి దివ్యమైన నినాదాన్ని (Slogan) మ్రోగించి పోయాడు తిలకు. ఇప్పుడందరూ అంటున్నారు ఇట్టి ధీరవచనాలు. అప్పుడు తిలకొక్కడే అని అష్టకష్టాలు పడ్డాడు.

## రైతు ఉద్యమం

(3 వ పేజీ తరువాయి)

### అప్పుల తగ్గింపు.

బొంబాయి కాంగ్రెసు లెజిస్లేటివ్ పార్టీ వెనెన్సీ బిల్లులోపాటు రాబోయే అప్పుల తగ్గింపు చట్టమును గూర్చి చర్చలు పూర్తిచేసి ఒకప్రకటన గావించింది. 1931 సం॥ పూర్వపు అప్పులన్నీ, ధరల పతనాన్నిబట్టి బాకీదారుని ఆస్తి, చెల్లింపగల సామర్థ్యాన్నిబట్టి తగ్గిస్తారట. ఇదికాక వ్యవసాయ దారులకు, వ్యవసాయోపకరణాల నిమిత్తం తక్కువ వాయిదామీద అప్పులిచ్చే కార్పొరేషను కూడా ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది.

ఈ కార్పొరేషన్ నిబంధనావళి రిజర్వుబ్యాంకి నిబంధనావళివలె వుంటుందట. వడ్డీ 3% కంటె ఎక్కువ వుండదు.

అయితే ఒక్కడ ఒక చిన్న యిబ్బంది వుంది. ఇదివరకు అప్పులిచ్చి వసూలు చేసుకోలేకపోతున్న షాహుకార్లంతా ఇందులో షేర్లు సంపాదించవచ్చు. దానిమూలంగా వారు బీద రైతులమీద ఎక్కువ ఒత్తిడి కూడా తేవడానికి ప్రయత్నిస్తారు. అందుచేత ఇది పూర్తిగా షాహుకార్ల కార్పొరేషన్ కాకుండా పూర్తిగా ప్రభుత్వం చేతిలోనే వుండేటట్లు చూడడం కాంగ్రెసు మంత్రుల ప్రథమ కర్తవ్యము.

## పంజాబ్

### రైతులపై లాఠీ చార్జీ:

### ఒక మరణం.

పంజాబ్ ప్రభుత్వం రైతులకేమీ సహాయం చేయుట లేదు. కాలువలలో నీరును తగ్గిస్తున్నది నీటి సదుపాయం లేక పంటలు పోయి రైతు పన్నులు చెల్లించలేక పోతున్నారు. దీనికి తోడు శిస్తు 4½ లక్షలు పెంచే సూచనలు చేస్తున్నారనికూడ వదంతిగా వుంది.

లయల్‌పూర్ జిల్లాలో రైతులు సత్యాగ్రహం ప్రారంభించారు. నీరు రావటం లేదని తమ పొలాలకు ఎగువనున్న తూములన్నీ మూసివేయడం మొదలెట్టారు. పోలీసులు అక్రమంగా లాఠీ చార్జి చేశారు. కర్తార్ సింగ్ అనే రైతు మరణించాడు. ఇది రైతులను మరింత రెచ్చగొట్టింది. 300 వాలంటీర్లు, 5 లేక 6 వేల రైతులు పెద్ద ఊరేగింపు సాగించి జలియన్ వాలాబాగ్ హాలు గేటు వద్దకు బయలుదేరారు. మేజస్ట్రేటు, పోలీసు సూపరింటెండెంటు వచ్చి 144 అందిచ్చారు. రైతులు యాత్ర మానలేదు. తమ యిబ్బందులు అధికారులకు తెలియచేస్తామన్నారు. మళ్లీ లాఠీ చార్జీ. 12 గురికి బలమైన గాయాలు. రైతులకు సానుభూతిగా అమృతసర్‌లో హర్తాలుకూడా జరిపారు, నగర కాంగ్రెసు సంఘంకూడా రైతులకు చాల సహాయం చేస్తోంది.

### సత్యాగ్రహం

రోజుకు 25 గురు చొప్పున జతలుగా నిషేధింపబడిన చోటుకు పోవానికి ఏర్పాటు చేశారు. రైతులు యిప్పటికి 4 జతలు అరెస్టు చేయబడ్డారు. ఇంకా సత్యాగ్రహం సాగుతూనేవుంది. ఒక సంవత్సరం వరకు సాగించడానికి ఏర్పాట్లు చేస్తూన్నారట.

### ఎసెంబ్లీలో చర్చ

ఈలాఠీచార్జి విషయం పంజాబ్ ఎసెంబ్లీలో చర్చకు వచ్చింది. చనిపోయే ముందు కర్తార్ సింగ్ వ్రాసిన జాబు చదువబడింది. సభ్యులంతా కంట తడిపెట్టారు. ఆ లేఖ కల్పితమని ప్రధాని త్రోసిపుచ్చాడు. ప్రభుత్వమంతే గిట్టనివారు, స్వలాభంకోసం ఆందోళన లేవదీశారన్నాడు కాల్వల తూముల వెడల్పు తగ్గించినా, రైతులు ఆందోళన చేయడం తప్పు అన్నాడు. లాఠీ చార్జీని సమర్థించాడు.

ఇవీ, కాంగ్రెసేతర రాష్ట్రాలలో రైతుల యెడ ప్రభుత్వాల వైఖరి!

## బెంగాల్

బెంగాల్ ప్రభుత్వం, వడ్డీ వ్యాపారుల చట్టాన్ని ఒకదానిని తేబోతూంది. అందులో వుండే ముఖ్య విషయాలివి. వడ్డీ వ్యాపారులు లైసెన్సు పొందాలి. 2 నెలల కొకసారి బాకీదార్లకు వారివారి అక్కవుంట్లు చూపాలి. లైసెన్సు పొందిన ఏరియాలో తప్ప ఇతరచోట్ల అప్పులివ్వ కూడదు. గవర్నమెంటు, కోఆపరేటివ్ సొసైటీలు, ఇన్సూరెన్సు కంపెనీలు పెట్టిన బాకీలు ఈ చట్టం క్రిందికిరావు. కోర్టులు, అన్ సెక్యూర్డు అప్పులమీద సాలుకి నూటికి రు 12 ల కంటెను, సెక్యూర్డు అప్పులమీద రు 9 ల కంటెను ఎక్కువ వడ్డీ రేటుకు డిక్రీ యివ్వకూడదు.

అయితే చివర ఇంకో మెలికపేచీ క్లాజు వుంది. బాకీదారు ఏ ఒక్క వాయిదాకైనా బాకీ ఇవ్వలేకపోతే, ఆ కేసులలో సాలుకి నూటికి రు 15 లు, రు. 25 ల వడ్డీరేటుకు కూడా కోర్టులో డిక్రీ లివ్వవచ్చు.

దీనితో బిల్లు యావత్తు ఊడిచి పెట్టుకు పోతుందన్నమాట. ఇటువంటి మేడిపండు చట్టాలను చేసి రైతులను మోసగించి తమ అధికారాలు నిలుపుకోడానికి సామ్రాజ్యవాదుల తొత్తు మంత్రాంగాలు చేసే బూటకపు బిల్లుల కిది మంచి తార్కాణం.

## బ్రహ్మపుత్ర వరదలు

బ్రహ్మపుత్ర నది విపరీతంగా పొంగిపోయింది. 400 గ్రామాలు పైగా నీటిలో మునిగిపోయాయి. ఇండ్లు, పశువులు, జనులు, రైలు రోడ్లు కొట్టుకుపోతున్నాయి. రైతులు చాల యిబ్బందిపాలై పోతున్నారు.

### ఆనాడే!

జవహర్‌లాలు పండితుడిప్పుడు "రైతులు పన్నులు నిరాకరణం చేస్తారు; సైనికులు కూడ శత్రులనే ఎదురపరుస్తారు; "ఖబర్దార్" అని ఇంగ్లండులో సామ్రాజ్యవాదులను హెచ్చరించుచున్నాడు. 1907 లోనే తిలకు యీ మాటలు చెప్పి కాసుకోండని బ్రిటిష్ సింహం యొక్క జూలు పట్టి ఉయ్యెల లూగేడు. వెన్నుచూపని వీరుడు, ముందు వెనుక లరయని త్యాగి. భవిష్యత్తును స్పష్టముగా చూడగల రాజనీతిజ్ఞుడు. సామ్రాజ్యవాదానికి గర్వశత్రువు తిలకు వీరుడు. సామ్రాజ్యవాదాన్ని "నువ్వా నేనా"? అని ఢీకొనుచున్న ప్రతి యువకునిలో ఆయన తత్వం జీర్ణించుకుపోయింది. తిలకు చచ్చిపోయాడని చెప్పడానికి ఎవరు సాహసించ గలరు?

ప్రజలకు ! ప్రచారకులకు !!

## సుప్రసిద్ధములగు జాతీయ గ్రంథములు.

1. ప్రభుత్వ ధనము — మన పీడనము
   జె. సి. కుమారప్పగారి ఆంగ్ల గ్రంథమునకు అనువాదము. ఇటీవల ప్రభుత్వ నిషేధము తొలగింపబడినది.
2. గాంధీ మహాత్ముని లండను ఉపన్యాసములు
   మహాత్మాజీ లండనులో రెండవ రౌండుటేబిలు సమావేశము సందర్భమున యిచ్చిన ఉపన్యాసముల అనువాదము. రచయిత: శ్రీ తిమ్మరాజు సత్యనారాయణగారు ఎం. ఎ.
3. హరిజన సమస్య
   ఆది కాలముల నాటినుండి నేటివరకును యీ యుద్యమాభివృద్ధిని విపులముగా చర్చించిన యుత్తమ గ్రంథము. రచయిత: శ్రీ నండూరి కృష్ణమాచార్యులు బి.ఏ.
4. ఆధునిక రాజ్యాంగ సంస్థలు
   (రెండు భాగములు) నవీన రాజ్యాంగ విధానములన్నియు ఇందు చర్చింపబడెను. రచయిత: ఆచార్య రంగాగారు.
5. చైనా జాతీయోద్యమము (రెండు భాగములు)
   ఆదినుండియు చైనా జాతీయోద్యమ చరిత్రము విశదీకరించు ముఖ్యగ్రంథము. రచయిత: శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

ఈ 7 గ్రంథములును విడివిడిగా ప్రతి 1 కి రు 0—8—0 లును, అన్నియు నొకేసారి కోరినచో మూడు రూపాయిలును మాత్రమే.

ప్రతులకు:—

**ఆంధ్ర ప్రచారిణి లిమిటెడ్, కాకినాడ.**

---

గడచిన 40 సంవత్సరములుగా హిందూ దేశమంతటా సాటిలేని పేరు గాంచిన



అ. అప్పాదొర మోదలి అండ్ సన్స్‌వారి

**మేలయిన మద్రాసు నశ్యం**

అ. అప్పాదొర మొదలియార్ అండ్ సన్సు

పోస్టు బాక్సు నెం 189, మదరాసు.

---

విన్నారూ ! ఈ వీరగాధ!

## అన్నా

జర్మనీలో కార్మికులు, కమ్యూనిస్టులు సల్పిన పోరాటం—త్యాగం—విప్లవం—కనులకు కనబడేటట్లు చిత్రించాడు నవలాకరుడు 'అన్నా'లో.

అశ్వనీకుమార్ దత్తుగారు మంచి రసవంతంగా అనువదించి ఆంధ్రులకు అందించారు. ఇలాంటి వీరగాధను చదవండి! ధన్యులుగండి!

300 పేజీలు.

అర్ధ రూపాయే సుమా!

మీ కాపీకి వెంటనే ఆర్డరు యివ్వండి.

ఏజన్సీ కావలసినవారు అణా బిళ్లతో వ్రాయండి.

పుస్తకము కావలసినవారు పది అణాల ఆరు పైసలు తపాలా బిళ్లలు పంపించండి.

దర్భా శ్రీరామశాస్త్రి,
న్యూస్ ఏజంటు,
భీమవరం; పశ్చిమ గోదావరి

---

# NEW AGE

JULY NUMBER

The only Marxist monthly in India. Edited by S. V. Ghate, of the Meerut Conspiracy Case fame. Contributers include foremost Socialists and Communists of our country. Order your copy now and become an annual subscriber.

CONTENTS.



Annual Subscription Rs. 1-8-0
Single Copy 0-2-0

*Manager,*
NEW AGE,
270 Triplicane High Road
MADRAS.

---

## మాప్లా తిరుగుబాటు

మలబారు రైతులు 6 నెలలు సాగించిన అప్రతిమాన సాహస యుద్ధ చరిత్ర.

గ్రంధకర్త:- తుమ్మల వెంకట్రామయ్య

వెల ఒక అణా.

**నవశక్తి కార్యాలయం,**

గవర్నర్‌పేట, బెజవాడ

---

## READ The CONGRESS SOCIALIST

The Organ of the all India Congress Socialist Party.

Subscription: Rs 4 per year.

Single Copy one Anna.

Address

*Manager*

**Congress Socialist,**
139 Medows Street,
BOMBAY.

---

## THE National Front

For consistent and bold advocacy of the policy of United National Front against Imperialism. For authoritative account of all mass battles.

Features all fronts National, Majdoor, Kisan, Students, International, Cultural.

Edited by the leading marxists of our country.

Single Copy One Anna.
Annual Rs. 4..
Half-yearly Rs. 2

For particulars write to:

*The Manager,*
NATIONAL FRONT,
62. E. Girgaon Road,
BOMBAY NO 4.

---

మీ వార్తాపత్రికలు కేటలాగులు, పుస్తకములు మొదలగునవి చిత్రించుటకు కావలసిన లైనుబ్లాకులు హాఫ్‌టోను బ్లాకులు మేము ఆధునిక ఎలెక్ట్రిక్ యంత్రముల సహాయముతో చేసి యిచ్చెదము. ఆంధ్ర దేశములో ఆంధ్రులచే బ్లాకులచేయు పరిశ్రమాలయ మిది యొక్కటి మాత్రమే. ఆంధ్రులందరు ఆదరించ ప్రార్థితులు.

వివరములకు ధరలకు నేడే వ్రాయండి.

**కుమార్ అండ్ కంపెనీ,**

ఫొటో ఆర్టిస్టు లైన్ అండ్ హాఫ్‌టోన్ బ్లాక్‌మేకర్స్, తెనాలి.

---

## "ప్రభ"

హిందీలో వెలువడే మార్క్సిస్టు మాస పత్రిక.

భారతదేశ మందలి సుప్రసిద్ధ కమ్యూనిస్టులు సోషలిస్టులు వ్యాసాలు వ్రాస్తున్నారు. హిందీ వచ్చిన ప్రతి వ్యక్తి చదువవలసిన పత్రిక.

సం॥ చందా 1—8—0
విడి ప్రతి 0—2—0

మేనేజరు "ప్రభ"
బైర్‌హనా, అలహాబాదు.

---

ఏ శాసనాలైనా ఇచ్చే గ్యారంటీకన్న ఎక్కువ నమ్మకమైన భీమా కావాలంటే, మదరాసు ప్రభుత్వ ట్రస్టీతో, ట్రస్టీ అరేంజ్‌మెంటున్న యునైటెడ్ ఇండియా లో భీమాచేయండి.

# యునైటెడ్ ఇండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ

లిమిటెడ్

[1906 లో స్థాపితము]

హెడ్ ఆఫీసు, మదరాసు

# అమృతాంజనం

## అన్ని నొప్పులకు దివ్యామృతం

## సుధాచంద్రిక

సీసా 1కి రు 2-0-0

సుధాచంద్రిక గనేరియా కాంతామునకు క్రిములను సంహరించి వ్యాధిని మొదలంట రూపుమాపును. మొదటి మోతాదులో స్రావము కట్టివేయును. మూత్రనాళమందలి మంట, పుండు, లక్షణములు. ఇతరౌషధములచే లోబడని కేసులు సహితము నయమగును.

## వసంత కుసుమాకరం.

తు 1కి రు 10-0-0

వసంత కుసుమాకరం తు 1కి 10-0-0 శాస్త్రీయముగ తయారు చేయబడినది. శరీర దారుఢ్యమును నరముల పటుత్వము నిచ్చును. అంమూత్రము మధుమేహము రాచపుండులకు ప్రసిద్ధికెక్కినది.

### క్షీరసముద్రం ఫార్మసీ, రాజమండ్రి.

## లకోటా ప్రశ్నలు.

ప్రత్యక్ష నిదర్శనం

అయిదు ప్రశ్నలు వ్రాసి కవరులో యుంచి సీలువేసి పంపిన, దేవీ మహిమచే ఫలితము లను వ్రాసి మీ సీళ్ళ కవరు సహా పంపుటకు రు 1—8—0. సంవత్సర ఫలితం నెలవారీ రు 1—12—0. నాడీ గ్రంథములు రీత్యా జాతకములు వ్రాయుదుము. వివరములకు వ్రాయుడు.

నేమాని సోమేశ్వరశర్మ.

శ్రీ సరస్వతీ జ్యోతిషాలయం, దేవాలయం వీధి. కాకినాడ.

సుప్రసిద్ధ

## హోమోపతి వైద్య గ్రంథములు.

1 అగ్గనాన్ అను హోమోపతి సిద్ధాంత శాస్త్రము. వెల. రు 3-0-0.

2 దీర్ఘవ్యాధుల చికిత్స. రు 2-0-0.

అంబమూరు గ్రామ పునర్నిర్మాణ హోమియోపతి వైద్యాలయము.

అంబమూరు, తూర్పు గోదావరి.

## చలంచర్ల నారాయణ మూర్తి గారి

ఫొటో మార్కు

## విష్ణాంజనం

అన్ని నొప్పులకు, దవుడు దెబ్బలకు, మూలవ్యాధులకు, బోదకాళ్లకు, కాల్పులకు, నరములకు, తేలు, జెర్రి మొదలగు విష జంతువుల కాట్లకు, పండ్ల బాధలకు, చెవులో చీము, రక్తమునకు దివ్యామృతం.

★ అన్ని షాపులయందు దొరకును.

★ ప్రతి టవునుకు యేజంట్లు కావలెను.

★ వివరములకు నేడే వ్రాయండి.

మొదటి రకం అగరువత్తులు, సెంట్లు, హైరాయిల్సు, పునుగు, జవ్వాది, కస్తూరి, జున్ను, గోరోజనం, పచ్చకర్పూరం మొదలగు పరిమళ ద్రవ్యములన్నియు దొరకును.

విష్ణాంజనం డిపో, రాజమండ్రి.

## నాడీ గ్రంథజ్యోతిషము.

తమ భూతభవిష్యత్ వృత్తాంతములను తెలియగోరువారు అల్పవ్యయమునకు శంకింపక తమ గ్రహచక్రములను పంపినయెడల జాతకములు వ్రాసి యివ్వబడును.

(1) పూర్వజన్మ వృత్తాంతముతో సంపూర్ణ జాతకము. 5—0—0.

(2) నష్టజాతకము 5—0—0.

(3) భృగువాక్య ప్రకారం ద్వాదశ ఫలములు చదివిచెప్పుటకు. 1—0—0.

మహాలక్ష్మి అను ఒక సిద్ధకవచము నావద్ద యున్నది. ఇది ఇష్టార్థసిద్ధియు నిచ్చును.

తాయత్తు వెల: రు. 2—0—0.

అడ్రస్:— టి. యస్. భట్.

శ్రీ భృగునాడీగ్రంథ జ్యోతిర్నిలయం.

C/o కృష్ణార్జున విలాస్. గుంటూరు.

## సమ్మర్ స్కూలు ఫోటోలు

మంతెనవారిపాలెం, ఆర్థిక రాజకీయ పాఠశాల విద్యార్థుల పోటోలు మావద్ద ఉన్నాయి.

(1) విద్యార్థులందరూ
(2) స్త్రీలు ప్రత్యేకంగా } సైజు 12"×10"

| | |
|---|---|
| విడికాపీ (అట్టలేకుండా) | 1-0-0 |
| అన్ రిజిస్టర్డ్ పార్శిల్ ఖర్చు | 0-4-0 |
| | 1-4-0 |

అట్టలో పంపడం వలన పోస్టేజీ అధికమౌతుంది. వి. పి. చేయడం కూడా ధన వ్యయం. కాబట్టి ఫొటోలు కావలసిన వారు ముందే డబ్బు మనియార్డరు చేయండి.

కుమార్ అండ్ కో

బ్లాక్ మేకర్స్ & ఫోటోగ్రాఫర్స్.

తెనాలి.

## విచిత్రములగని, మనస్శక్తి

ఈ గ్రంథములో, హవాయిలను పసిగెత్తుచూ వచ్చునట్లు చేయుట. దొంగలు దొంగిలించుకు పోయిన వస్తువులు ఫలాని వస్తువులు ఫలానివారు దొంగిలించుకు పోయినారని వారున్న చోటునుండియే చెప్పి తెప్పించుట, పేట్లపేక ఆటలో యెవరివద్ద ఏయే ముక్కలు యున్నవి చూడకుండా తెలుసుకొనుట, చెప్పుట, పాములను, తేళ్లనుబట్టి ఆటవస్తువులుగా ఆడించుట, జ్యోతిష్కుల రహస్యములు శీలుజేసిన కవరులోని ప్రశ్నలు కవరు చించక తెలుసుకొని జవాబులిచ్చుట, ఖూనీ చేయుట, సర్వవ్యాధులు గంటలమీద కుదుర్చుట మొదలగు రహస్యములు గలవు. ఆర్డరులో పూర్తి సొమ్ము పంపవలెను. అడ్వాన్సులేని ఆర్డరు పట్టము. కొద్ది ప్రతులే వున్నవి. తిరిగి అచ్చువేయించబడవు.

గ్రంథము వెల రు. 2—7—0 లు.

పి. వి. స్వామినాయుడు, కన్సల్టింగ్ అస్ట్రాలజర్,

గొట్టిపాడు గ్రామం, పత్తిపాడు పోస్టు, (గుంటూరుజిల్లా.)

## మీ రక్తమును విషపూరితము కానీయకుడు

పీటో

చర్మముమీద చిన్న పగులున్ననూ అది చాల ప్రమాదకరము. విషక్రిములు శరీరమునందు ప్రవేశించి రక్తమును విషపూరితము చేయగలవు. రక్త ప్రసరణ మండలమంతయు విషక్రిములతో నిండి ఆరోగ్యము ధ్వంసమగును.

'పీటో' రాసినంతనే విషక్రిములు నాశనమయి, రక్తము విషపూరితము కాకుండ కాపాడును.

మీ శరీరము మీద ఎచటనైన కోతగాని, పగులుగాని, వ్రణముగాని, యున్నచో పీటో వాడుడు. అణా బిళ్ళ పంపువారికి శాంపిల్ ఉచితము.

పీటో మాన్యుఫాక్చరింగ్ కంపెనీ, రాజమండ్రి.

Printed, Edited and Published by M. Annapurniah at Navasakti Press, Governorpet, Bezwada

